# వి ష య సూ చి క




# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౯ { ౧౯౫౩ – మే : : విజయ – అధిక వైశాఖము { సంచిక ౧౧


## ప్రార్థన

శ్లో. అణీయసే విశ్వవిధారిణే నమో
నమోఽన్తికస్థాయ నమో దవీయసే।
అతీత్య వాచం మనసాం చ గోచరం
స్థితాయ తే తత్పతయే నమో నమః॥

అసంవిదానస్య మమేశ సంవిదాం
తితిక్షితుం దుశ్చరితం త్వ మర్హసి।
విరోధ్య మోహాత్పునరభ్యుపేయుషాం
గతిర్భవానేవ దురాత్మనా మపి॥

అణువువలె నుండియు విశ్వమును రక్షించు ప్రభూ! నీకు నా నమస్కారము. (భక్తులకు) మిక్కిలి దగ్గరను (భక్తిలేనివారికి) మిక్కిలి దూరముగను ఉన్న నీకు నా వందనములు. మనోవాక్కులకు ప్రభువై యుండియు వానిచే పట్టువడని నీకివే నా నమస్కారములు.

ఓ జ్ఞానమూర్తీ! నా అజ్ఞానజన్యమైన తప్పును నీవు క్షమింపుము. ఏలననగా, నీ మోహగ్రస్తులై నీతో మొదట విరోధించి పిదప శరణుజొచ్చు దురాత్ములకు నీవొక్కడవే గతి.

కిరాతార్జునీయము (భారవి) 41–42.



ఓం నమో భగవతే శ్రీ రామకృష్ణాయ!

# శ్రీ రామకృష్ణ వచనామృతము—'మ.'

## దక్షిణేశ్వర దేవాలయమున భక్తులతో శ్రీ రామకృష్ణ గురుదేవుడు

ఆదివారము,
23 డిశంబరు, 1883.

అది ప్రాతఃకాలము తొమ్మిదిగంటలవేళ. తనగదికి ఆగ్నేయముననున్న వసారాయందు శ్రీరామకృష్ణగురుదేవుడు, రాఖాల్, లాటు, హరీష్, 'మ.' మొదలగువారితో గూర్చొని యుండెను. శ్రీ వనమోహనుడు కోన్నగరమునుండి కలకత్తా పోవుచు మధ్యనున్న దక్షిణేశ్వరములో శ్రీరామకృష్ణగురుదేవుని దర్శించి కొంతసేపు విశ్రమించిపోవు నుద్దేశముతో ప్రాతఃకాలముననే యచటికి వచ్చిచేరెను. హజ్రా శ్రీ.రామకృష్ణగురుదేవుని యొద్ద గూర్చొనియుండెను. ఈ సమయమున నీలకంఠమునుండి వచ్చిన యొక వైష్ణవభక్తుడు కొన్ని పాటలను గురుదేవునకు వినిపించుచుండెను.

ఆయన శ్రీచైతన్య ప్రభువునుగూర్చి యొక కీర్తనమును బాడి, అనంతరము మానసబోధను గూర్చి మఱియొక గేయమును పాడెను.

శ్రీరామ :—(హజ్రాతో) ఈ (మానసబోధ) పాట ఏదో ఒకవిధముగా నున్నది.

హజ్రా :—ఆ పాటలు సాధకులకొఱకు గావు. జ్ఞానదీపము, జ్ఞానప్రతిమవంటివి.

శ్రీరామ :—ఇది నాకు నచ్చలేదు. పూర్వకాలికుల గేయములే మంచివి. పంచవటియందు తోతాపురియొద్ద నేను పాటలు పాడుచుండువాడను.—'ఓ జీవుడా! సమరసజ్యాడవుగమ్ము. కాలుడు రణవేషముతో నీ యింట దూకుచున్నాడు' అను భావముగల పాట ఒకటియు, 'తల్లీ! ఎవరిదోషమునుగాదు; నా చేతితో ద్రవ్విన గోతిలోబడి నేనే చచ్చిపోవుచుంటిని' అను భావముగల పాట యొకటియు పాడువాడను.

తోతాపురి యెంతయో జ్ఞాని. అయినను నా పాటకు అర్థము తెలియకుండనే ఏడ్వనారంభించెను. ఆ పాటయందేదో సరియైన భావమున్నది. ''శ్రీకాంతుడును నరకాంతకారియు నితాంత భయాంతకుడును నగు హరిని భజింపుము.''

పద్మలోచనుడు నేను పాడిన రామప్రసాద కీర్తనమును వినినపుడంతయు భక్త్యశ్రువుల రాల్చువాడు. చూచితివా, ఎంతటి పండితుడైనను అతని మానసికస్థితి!

శ్రీరామకృష్ణగురుదేవుడు భోజనానంతరము విశ్రమించియుండెను. నహబత్తునందు జరుగుచుండిన వాద్యసంగీతములను విని ఆనందించుచుండెను. 'మ.' నేలపై కూర్చుండెను. కొంతసేపటికి 'మ.' కు బ్రహ్మమే ఈ జీవజగత్తులు సమస్తము నయియున్నదని బోధించుచుండెను.

శ్రీరామ:—('మ.' తో) కొందఱు ఫలానా చోట హరినామమే లేదని నాకు జెప్పిరి. కాని ఆ పలుకులు విన్నంతనే భగవంతుడే సమస్తజీవరాసులునై యున్నట్లు నేను జూచితిని. ఏదో అసంఖ్యాకములగు బుద్బుదములు—అసంఖ్యాకములగు ప్రతిబింబములవలె గన్పించెను. కొన్ని సమయములందు అందఱును శ్రీ సచ్చిదానందమాత్రలవలె కనిపించిరి. ఆ యూరునుండి వర్ధమానమునకు బోవుచుండ, జీవరాసులెట్లు తమ ఆహారమును గైకొని జీవించునో జూడదలంచి ఒక బయలునకు బోయితిని. అచట చీమలు ప్రాకుటను జూచితిని. సమస్తమును చైతన్యమయముగా నుండెను.

ఈ సమయమున హాజ్రా వచ్చి క్రింద గూర్చొనెను.

శ్రీరామ:— మఱల వివిధ పుష్పదళములు ఎట్లు ఒకదానితో నొకటి, వరుసపై వరుసగ తీర్పబడియుండునో అట్లు (జీవరాసులు) నాకు కనిపించెను. మఱియు నవి చిన్న బింబములవలెను పెద్ద పెద్ద బింబములవలెనుగూడ కనిపించెను.

ఇట్టి వివిధములగు ఈశ్వరీయరూపదర్శన వాక్యము లుచ్చరించుచు శ్రీరామకృష్ణగురుదేవుడు సమాధిస్థితుడయ్యెను. ఆ సమయమున 'నేను అయితిని, నేను వచ్చితిని' అని పలికెను. ఇట్లు పలుకుచు, మఱల సమాధిస్థుడై సుస్థిరుడయ్యెను. చాలకాలమున కనంతరము కొంచెము స్పృహ కలిగినది. అపుడు చిన్ని బాలకునివలె నవ్వుచు గదిలో నటు నిటు పచార్లుచేయనారంభించెను. ఒక అద్భుతదర్శనమును గాంచినవాని కంటినుండి జ్యోతి వెలువడునట్లు శ్రీ గురుదేవుని కంటినుండి జ్యోతి వెలుగుచుండెను. శూన్యదృష్టి, హాస్యవదనము......

శ్రీరామ:—నేను పంచవటియొద్ద నొక పరమహంసను జూచితిని. ఇక్లే నడచుచు, నిక్లే నవ్వుచుండెను. ఆ స్థితియే నాకును సంభవించినదా యేమి?

నవ్వాటలాపి, చిన్నమంచముమీద కూర్చొని దేవితో సంభాషింపదొడగెను.

శ్రీరామ:—పోనీలే, అదియంతయు నాకు దెలియనవసరము లేదు. నీ పాదపద్మములందలి శుద్ధభక్తిని బ్రసాదింపుము.

('మ.' తో) దుఃఖములును, కోరికలును వీడిపోయిననే యిట్టి యవస్థ సంభవించును.

(మఱల దేవితో) అమ్మా! నా పూజలన్నియు మాన్పివేసితిని. వాసనలన్నియు లేకుండ చేయకుము. పరమహంస బాలకుడు. బాలుడు తల్లిని కోరడా! నీవు నా తల్లివి. నేను నీ శిశువును. తల్లిని వీడి శిశువెట్లు జీవించును?

శ్రీరామకృష్ణగురుదేవు డిట్లు దేవితో సంభాషించుట విన్నచో పాషాణహృదయునకుగూడ మనస్సు కరగును.

(మఱల తల్లితో) శుద్ధ అద్వైతజ్ఞానమా? ఛీ. ఎంతవఱకు 'నేను' అన్న జ్ఞానము నుంటువో అంతవఱకును 'నీవు' గూడ నుందువు. పరమహంస బాలకుడు. అతడు తల్లిని కోరడా?

ఇదియంతయు విని 'మ.' ఆశ్చర్యపడిపోయెను. దేవదుర్లభమగు నిట్టి స్థితియందున్న శ్రీ గురుదేవునిజూచి అహేతుక కృపాసింధువు గదా మహానుభావుడు అని తలంచెను. భగవంతుడు తనయందు విశ్వాసము కలిగించి, చైతన్యమును కలిగించి, జీవశిక్షణార్థము గురు

స్వరూపియగు శ్రీరామకృష్ణ భగవానుడే ఈ పరమహంస అవస్థయందున్నట్లు తలంచెను.

మఱియు "శ్రీరామకృష్ణగురుదేవుడు అద్వైతము, చైతన్యము, నిత్యానందము" అని చెప్పుచున్నాడు. అనగా అద్వైతజ్ఞానము లభించినచో చైతన్యము కలుగును. అపుడే నిత్యానందముగూడ లభించును అని భావము. శ్రీ గురుదేవుడు శ్రీ జగన్మాతృప్రేమానందసాగరమున మైమఱచియున్నాడని తలంచెను.

హజ్రా శ్రీ గురుదేవుని యీ సమాధిస్థితిని గాంచి చేతులు జోడించి యపుడపుడు మీరు ధన్యులు, మీరు ధన్యులు! అని వచించుచుండెను.

శ్రీరామ :—(హజ్రాను జూచి) నీకు నమ్మకమేది? నీవిచట జటిలునియందలి కుటిలునివలె లీలకుపుష్టిగలిగింపనున్నావు.

సాయంకాలమయినది. 'మ.' ఒంటరిగా దేవాలయమున పచార్లుచేయుచుండెను. శ్రీ రామకృష్ణ గురుదేవుని అద్భుతావస్థలను గూర్చి ఇట్లాలోచించుచుండెను. పిదప ఆయన దుఃఖములును కోరికలును వీడిపోయిననే యిట్టి యవస్థ సంభవించునని యేల చెప్పెనోకదా? శ్రీరామకృష్ణగురుదేవుడెవరు? స్వయముగా భగవానుడే మాకొఱకు మానుష శరీరము ధరించి యవతరించెనా?

అవతారపురుషుడు, ఈశ్వరకోటియు కానిచో జడసమాధినుండి సాధారణ స్థితికి రాజాలడని శ్రీ గురుదేవుడు చెప్పియున్నాడుగదా యని తనలో తలపోయుచుండెను.



# షట్పదీ స్తోత్రము

రచయిత :
శ్రీ శంకరాచార్యులు

ఆంధ్రానువాదకులు :
వైద్యవిద్వాన్, సత్కవి శ్రీ నారు నాగనార్యులు

శ్లో॥ అవినయ మపనయ విష్ణో దమయమనః, శమయ విషయ మృగతృష్ణాం।
భూతదయాం విస్తారయ తారయ సంసార సాగరతః॥

గీ॥ నాయహమ్మడఁగించి మనస్సు నొంచి విషయ మృగతృష్ణ వారించి విస్తరించు
సర్వ భూతదయామతి సంతరించి నన్ను భవవార్ధి దాటింపు మన్నకృష్ణ. 1

శ్లో॥ దివ్యధునీమకరందే పరిమళపరి భోగసచ్చిదానందే।
శ్రీపతి పదారవిందే భవభయ ఖేదచ్ఛిదేవందే॥

కం॥ వందనము స్వర్ధునీమక రందము, సౌరభవిభూతి రమణీయచిదా
నందము, భవభయఖేదా రిందము, నగుహరి పదాబ్జ-రేఖేందిరకున్, 2

శ్లో॥ సత్యపి భేదాపగమే నాథ ! తవాహం నమామకీ నస్త్వం !
సాముద్రోహి తరంగః క్వచన సముద్రో న తారంగః ॥

గీ॥ నేనునీవాఁడ నావాఁడ వౌదె? నీవు జలధికగుఁ గానియలలు దజ్జలధియలల
కెట్టులగు ? సాగరోర్మ్యు లూహింపనొకటె యోప్రభూ ! చూడ, నీవునే నొకటిగాదె. 3

శ్లో॥ ఉద్ధృతనగ నగభిదనుజ దనుజకులామిత్ర మిత్రశశిదృష్టే
దృష్టేభవతి ప్రభవతి నభవతికింభవ తిరస్కారః ॥

కం॥ విజయోద్ధృతనగ నగభిదనుజ దనుజామిత్ర మిత్రనూత్నేందుకళా
నిజదృష్టి దృష్టిమాత్రన భజియింపఁగ ముక్తియింక భవభయమేలా ? 4

శ్లో॥ మత్స్యాదిభి రవతారే రవతారవతావతాసదా వసుధాం
పరమేశ్వర పరిపాల్యో భవతా భవతాప భీతోఽహం ॥

కం॥ పరమేశ్వర మత్స్యాద్యవ తరణమ్ముల ధరణి బ్రోవదయచేయవె ? సం
సరణదవానల తప్తుని బరిరక్షణసేయఁ దగదెపరిపూర్ణకృపన్.  5

శ్లో॥ దామోదర ! గుణమందిర ! సుందరవదనారవింద ! గోవింద !
భవజలధి మథన మంథర పరమందరమ పనయత్వంమే ॥

కం॥ భవజలధి మథనమందర నవవికసిత సుందరాస్యనలినా ! గోవిం
ద ! విమలగుణమందిర ! నా దవుభవభయ మడఁపుమా ! దయన్ వనమాలీ. 6

శ్లో॥ నారాయణ కరుణామయ శరణం కరవాణి తావకౌచరణౌ
ఇతిషట్పదీ మదీయే వదన సరోజే సదావసతు ॥

కం॥ కరుణావరుణాలయ ! నీ చరణములే శరణ మిదియె షట్పద మిఁక నా
పరిమళ వదనాంబుజమునఁ జిరతరముగఁ దిరుగుఁ గాత ! శ్రీకృష్ణ విభూ. 7

ఇతి శ్రీమచ్ఛంకరాచార్య విరచితం షట్పదీస్తోత్రం సంపూర్ణమ్

ఓం తత్సత్ ! ఓం తత్సత్ !! ఓం తత్సత్ !!!



# బుద్ధ భగవానుని సదుపదేశములు

1. తాము నివసించుచుండిన చెరువు, గుట్టలను కన్నెత్తియైన చూడక హంసములు విడిచి పోవునట్లు, ముముక్షువులు ఈ సంసార జీవనమును త్యజించి ఉన్నత మార్గమును అనుసరింతురు.

2. ఇహ జీవనము అశాశ్వతమనియు, అసత్యమనియు తెలిసినవారికి ఈ ప్రాపంచిక విషయ వాసనలు ఏవియు నుండవు. ఆకాశమున ఎగురుచుండు పక్షుల వెంబడించుటలాగున వీరి మార్గమును అనుసరించుట యంత అసాధ్యమట.

3. ధాత్రివలె క్షమయు, స్థాణువువలె స్థైర్యమును, తేటనీరుగల తటాకమువలె పవిత్రతయు గలవాడు పునర్జన్మ మెట్టిదో ఎరుగడు.

4. చక్కటి పక్వస్థితి చెందినవాని మనోవాక్కాయములు శాంతితో నుండును.

5. కామాదులవీడి, జన్మమునకు కారణమైన బంధముల త్రెంచి, ముక్తినికోరువాడే మానవులలో శ్రేష్ఠుడు.

6. ఎందుకు ప్రయోజనములేని మాటలను వేలకొలది చెప్పుటకంటె విన్నవానికి శాంతి నిచ్చు సదుపదేశ మొకటి ఎంతయో గొప్పది.

7. వేడుకపాటలను వేలకొలది పాడుటకంటె పరవశము కలిగించు ఒక పాట పాడిన చాలదా ?

8. యుద్ధరంగమున వేలకొలది సైన్యమును కొట్టి చంపువానికంటె, తన యహంకారమును జయించువాడే శ్రేష్ఠుడగు వీరుడు.

9. తన్ను జయించుటయే జయము. తన చెడుగుణముల పోగొట్టి నెమ్మదితో నుండు వానికి కీడుచేయుటకు దేవేంద్రాదులకుకూడ వీలుగాదు.

10. వేలకొలది ధనము కర్చుపెట్టి ఎన్నియో సంవత్సరములు యాగముచేయుటకంటె, సంయమముతోగల పెద్దలకు ఒక క్షణము (ఒకమాటు) మ్రొక్కుటయే మేలైన ధర్మము.



# ముక్త పురుషుడు

రచయిత :
శ్రీ వివేకానందస్వామి

అనువాదకుడు :
శ్రీ పిన్నంటి సుబ్బారావు

సాంఖ్యమతము, ఆత్మ, ప్రకృతి సిద్ధాంతములయందు ద్వైత దర్శనముతో నంతమగుచున్నది. మరణములేని యాత్మలు, ప్రకృతికి భిన్నముగా ననేకములు గలవనియు, ఈ ప్రకృతియే యీ సమస్త సృష్టియు చేయుచున్నదిగాని, యాత్మలకు సంబంధములేదనియు, ఈ యాత్మలు తా మెప్పుడు ప్రకృతికంటె భిన్నులమని గ్రహించునో యప్పుడు వానికి మోక్షముగలదనియు చెప్పుచున్నది. ప్రతి యాత్మయు, దేశ, కాల, పాత్రముల కతీతమనియు, సర్వాంతర్యామియనియు, సిద్ధాంతీకరించుచున్నది.

ప్రకృతియు, ఆత్మయు రెండును శాశ్వతములగుచో, రెండును దేశ, కాల, పాత్రముల కతీతమగుచో, అప్పుడు మార్పు అనునది, సృష్టియనునది యసంభవమగును. శాశ్వతములగు రెండు తత్త్వములుండుట యసంభవము. ప్రపంచమును సృజించుటకుగాని, మనస్సు పని చేయుటకుగాని యొక మాయాతీతవస్తువు ఆధారముగావలసి యున్నదని నుడువు సాంఖ్య సిద్ధాంతమును వేదాంతము సమర్థించుచు, ఆ మాయాతీతవస్తువు భగవంతుడుతప్ప అన్యముగాదనియు, ఈ సృష్టి యాతని స్వరూపముగాక వేరుగాదనియు చెప్పుచున్నది. ఆతడే నిమిత్తకారణమును ఉపాదానకారణమును; కారణముకంటె కార్యము వేరుగాదు. ద్వైత, విశిష్టాద్వైత, అద్వైతతత్త్వములు మూడును ఈ సత్యమునే ఋజువుచేయుచున్నవి. ఒక పెద్ద నిప్పురాశినుండి, యనేక చిన్న చిన్న నిప్పుకణములు బయలుదేరునట్లు, ప్రతి ఆత్మయు, ఆ సర్వాత్మయొక్క యంశములైయున్నవి. ఇచ్చట ఒక ప్రశ్న యుదయించుచున్నది. సర్వాత్మయొక్క యంశమననేమి? అంతట నిండియున్న పరమాత్మనుండి భాగము లెట్లేర్పడుచున్నవి? విశిష్టాద్వైతులు, అద్వైతులు ఈ యాత్మలు, పరమాత్మయొక్క భాగములుగావనియు, అవన్నియు, పరబ్రహ్మలేయనియు నుడువుచున్నారు. అయితే ఆత్మలు అసంఖ్యాకములాయని మఱల సందేహముగలుగుచున్నది. వివిధ నీటిబిందువులయందు వేరువేరుగా సూర్యుడు గానబడుచున్నను, అవన్నియు అసలు సూర్యస్వరూపములుగాక, ఆతని ఛాయామాత్రములే యగునట్లు, ఈ వివిధాత్మలు, ఈ సమస్త జీవరాసులు, ఈ సృష్టియావత్తు ఆతని ఛాయామాత్రముగాని, యథార్థస్వరూపముగాదు. ఈ వివిధ నామరూపములుగా గాన్పించునదంతయు మాయ. యథార్థస్వరూపముగాదు. దేశ, కాల పాత్రములచే ఆ పరమేశ్వరుడు ఈ భిన్న భిన్నరూపములుగా గానబడుచున్నాడు. అతడే కర్త, అతడే కర్మ. దేశ, కాల, నిమిత్తములతో గూడిన ఈ చిత్రజగత్తునుబట్టియే యాపరాత్పరుని గ్రహింప

వలయును. భగవంతుడు అణువు మొదలు, మహత్తువఱకు ప్రతిఫలించి, తద్వారా తన్ను తాను దెలియబడుచున్నాడు. మానవుడు తన ముఖమును జూడదలచి, బురదనీటియందు నామమాత్రాకారమును, అంతకంటె స్ఫుటముగా పరిశుద్ధోదకమునందును, మెరయుచున్న లోహమునందును, యథాతథముగా అద్దమునందును గాంచుచున్నట్లు పరమేశ్వరస్వరూపమును, తనయందు పరిపూర్ణముగా గాంచుచున్నాడు. అవతారమూర్తులయందు, పరిపూర్ణమానవులయందు, ఈ విషయము స్పష్టముగా గోచరమగుచుండును. పరిపూర్ణుడు ఎట్లు బంధితుడైనాడని ప్రశ్నింపవచ్చును? అసలు బంధనమే లేదు. మేఘము వెంబడి మేఘము క్రమ్ముచున్నను, గప్పబడియున్న సూర్యునకును, వానికిని ఎట్లు సంబంధము లేదో, ఆరీతిగా, నేను మానవుడను, నేను పాపిని అను నీ యూహలు భ్రమజనితములు. నీవు పరిపూర్ణుడవు. నీవు అన్నింటియందును గలవు. నీ యందు అన్నియును గలవు. ఈ జ్ఞానము నీ కెప్పుడు గలుగునో యప్పుడు నీకు పరమ శాంతి, మోక్షస్థితి సిద్ధించగలదు.

పరివ్రాజకరూపమున భారతదేశములోనొక యెడారియందు సంచరించుచు ఒక మాసము వఱకు, అచ్చటచ్చట సుందరదృశ్యములను, సరోవరములను గాంచుచుంటిని. ఒకనాడు దప్పిగొని, యొక సరోవరముచెంతకుబోగా, అది యదృశ్యమయ్యెను. వెంటనే యది భ్రాంతియనియు, ఎండమావియనియు గ్రహించితిని. మఱునాడు యథారీతిగా సంచారము చేయుచుండగా ఆ దృశ్యములు మఱల గాన్పించెను. తోడనే అయ్యవి మరుమరీచికములను భావము స్ఫురించగా అవి మాయమయ్యెను. ఈరీతిగా తన యథార్థస్వరూపమును మానవుడు గ్రహించినంతనే, యీ నామరూపాత్మకమగు మాయాజగత్తు అదృశ్యమై యిది యంతయు పరమేశ్వరస్వరూపమేయని తెలియగలడు. వేదాంతమనునది పాండిత్య ప్రకర్షణ గాదు. అనుభవము. నేను శరీరమును, మనస్సును అను భావము పూర్తిగా పోవును లేదా కొంతవఱకైనను పోవును. కుమ్మరివాడు సారెను గిరగిర త్రిప్పి వదలిన అది యాగక, కొంతకాలము వఱకు ఎట్లు తిరుగుచుండునో, యారీతిగనే, ప్రారబ్ధకర్మ మిగిలియున్నచో, ఈ శరీరమును ధరించి, ఈ బాహ్యజగత్తును గాంచుచు, మరుమరీచికముమాదిరిగా, ఈ కనబడునదంతయు పరమేశ్వరుని స్వరూపమేయని చూచుచు, తామరాకుపైనున్న నీటిబిందువుపగిది, నిస్పృహత్వముతో, జీవన్ముక్తుడై మెలగగలడు. నీవే యీ సమస్తము అని గ్రహించిననాడు భయము దూరముగా పలాయనమగును. చూచువాడు, చూడబడునదియు సమస్తము ఒక్కటే. ఈ ప్రపంచము త్రికాలములయందును లేదు. అంతయు ఆత్మస్వరూపమేయని గ్రహించిననాడు, ఈ జీవితమునందలి సమస్తకష్టములు, దుర్మార్గములు మనలను బాధింపజాలవు. అందులకై స్వేచ్ఛాజీవివిగమ్ము అని జ్ఞానయోగము చెప్పుచున్నది. జ్ఞానమునందు సిద్ధినిబడయుట చాల కష్టము. అది సాహసవంతులయొక్కయు, ధైర్యవంతులయొక్కయుమార్గము. "అన్నమైతేనేమిరా మరి సున్నమైతేనేమిరా, అందుచే అన్నమే తిందామురా" యనెడి వేదాంతము పనికిరాదు. ఆపదలు వచ్చినను, బాధలు గలిగినను, అవి నాకు లేవు, ఈ శరీరమందు బాధపడుచున్నను, నేను సర్వాంతర్యామిని, గాన, నాకు ఇంకను

ఇతరశరీరములు గలవు. అచ్చట సుఖపడు చున్నాను అని జ్ఞానయోగి సదా తన సర్వాంతర్యామిత్వమును ధృఢీకరణముచేసికొనుచు, సర్వజ్ఞుడై యుండవలయును.

సచ్చిదానందస్వరూపుడు మాయాధీనుడెట్లయ్యెను? అను ప్రశ్న యుదయించుచున్నది. పరబ్రహ్మస్వరూపము దేశ, కాల, నిమిత్తముల కతీతము. అవాఙ్మానసగోచరము. ఈ ప్రశ్న దేశ, కాల, నిమిత్త బాధితము. అట్టితరి మనము మాయకు లోబడినవారమై మాయాతీతవస్తువునుగూర్చి ప్రశ్నించుటెట్లు, అంతయు మాయయే. కాన మన పూర్వీకులు ఈ చిక్కు సమస్యను లోతుగా తరచక, జబ్బుచేసిన వాడు తన రోగమునకు వలయు మందు పుచ్చుకొనుటయందే తన యాలోచనలు పోనియ్యవలయునుగాని, తన రోగకారణమును గూర్చి తన కాలమునంతటిని తలపోసిన ఎట్లువ్యర్థమో, ఆ రీతిగా, తన నిజస్వరూపమును గ్రహించుటకై మానవుడు తలపోయవలయునుగాని, యిట్టి విషమ ప్రశ్నలచే, తన జీవితమును వృథాజేసికొనరాదు. అద్వైతులు, భ్రాంతి లేక మాయయనునది లేనేలేదనియు, యున్నదొక్క పరబ్రహ్మస్వరూపమేయనియు, నిర్ధారణజేసిరి. మాయాధీనులై యున్నంతవఱకు సకల ధర్మములు, పుణ్యాపాపములు, వివిధ ఆరాధనా తంతులు అన్నియును అవసరమే. మాయాతీతుడైనవాడే స్వేచ్ఛాధికారియన బడును. మాయకు లోబడి నేను స్వతంత్రుడను అని పల్కుట శుష్కవచనము, అసంగతము. స్వప్నమందు మన స్వప్నవిషయము లన్నియును ఎట్లు యథార్థములని నమ్ముచు, జాగ్రదవస్థయందెట్లవి మిథ్యలని తలచుచున్నామో యదేరీతిగా మాయకు బద్ధులమైయున్నంతవఱకు ప్రపంచము సత్యమనియు, దానిని అధిగమించిననాడు ఇదే మిథ్యయనియు తెలియబడగలదు. ఈ స్థితి, మాటలకు, చూపులకు అతీతమగుస్థితి. ఈ స్థితియందే పూర్ణమానవత్వము, స్వాతంత్ర్యము సిద్ధించగలదు.

ఇట్టి స్థితిని బొందుటెట్లు? దీనికి సాధనలు అవసరము. నీ సహజస్థితి నీయందేకలదు. నీవు ఇంతకుపూర్వమే పరిపూర్ణపరబ్రహ్మమవు. నీవు నీలో నేను ఫలానా, ఇది నాది, వానిది యిది యని తలచు సమస్తభావములు భ్రాంతి జన్యములు. ఈ భ్రాంతిపోయి, నీ సచ్చిదానందస్వరూపస్థితి స్థిరపడుటకై సాధనలు అవసరము. అయితే ఇవిమాత్రము మాయగాదా? అవును. ఎట్లు ఒక మేఘమును ఇంకొక మేఘము తరిమివేయునో, ఎట్లు కాలియందున్న ముల్లును తీయుటకు ఇంకొకముల్లు సహాయముగ గైకొని తీసినపిమ్మట ఆ రెంటిని పారవేయుదుమో ఆరీతిగ, మాయను ఇంకొకరీతి మాయచే గెంటివేసి, యా రెంటిని యధిగమించిననాడు తన స్థితి తెలియగలడు.

హిందువులకు, మహమ్మదీయులకు నక్క అపవిత్రజంతువు. నక్కగాని, కుక్కగాని తాకిన వస్తువులు అపవిత్రములు. ఒకమహమ్మదీయుడు ఒకనాడు తాను వండుకొన్న వంటకమును తినబోవుచుండగా, ఒక నక్కవచ్చి యాహారము ముట్టుకొనెను. అంతట ఆమహమ్మదీయు డాయాహారము అపవిత్రమైనదనితలచి, వారి మతగురువు నొద్దకుబోయి ఏమిచేయ మందువని యడిగెను. అంత ఆ మహమ్మదీయ మతగురువు, ఒక కుక్కను దీసికొని వచ్చి యా నక్కముట్టిన యాహారమును ముట్టించమనెను. అంత యాయాహారము పవిత్రమగునెను. అదేరీతిగా, మాయను మాయ

చేతనే దాటవలయును. మాయాస్వరూపమే సాధనములు. ఏ సాధనములు లేక తన నిజ స్థితి సిద్ధించ నేరదు. అట్లు తలచుట వట్టి భ్రమ.

జ్ఞానయోగులగుటకు అర్హులెవ్వరు? ఐహికాముష్మికఫల భోగవిరాగత్వము అనగా నిష్కామ కర్మానుష్ఠానమునందు సిద్ధినిబొందిన వారలకే వేదాంతజ్ఞానమలవడును. నీ జీవితమునకు నీవు ప్రభువవు. నీ ప్రపంచమునకు నీవు బ్రహ్మవు. నీ తలంపులు యథార్థములగును, కొందరియందు త్వరగా ఫలించును. కొందరియందు పూర్వసంస్కార బలముచే ఆలస్యముగా ఫలించును. ఈ జీవితమునందలి సౌఖ్యములను త్యజించుము. జీవితమే మరణము. మరణమే జీవితము. ఇవన్నియును మనోకల్పితములు. అసలు నీకు జీవితమేలేదు. అట్టితరి మరణమును లేదు. ఇహలోకమును లేదు, పరలోకమును లేదు. ఇట్టి నిస్స్వార్థబుద్ధితో కర్తవ్యకర్మను చేయుచు మొదట సిద్ధిని గాంచవలయును. పిమ్మట శమ దమములు తితిక్ష ముఖ ధర్మములు గావించుకొనవలయును. మనోభావములను అరికట్టవలయును. శీతోష్ణాది ద్వంద్వములను, సుఖదుఃఖములను సకలమైన బాధలను (మనస్సునందుగూడ బాధపడక ఓర్చుకొనవలయును) జయింపవలెను. మత మనగా, వేదాంతమనగా మాటలుగాదు. ఇట్టి ధీరులే విజయమును పొందగలరు. శ్రీరామకృష్ణులు చెప్పినట్లు రాబందులు పర్వతాగ్రములపై వ్రాలినను, క్రిందనున్న మృతకళేబరములకై ఎట్లు దృక్కులను క్రిందికి ప్రసరింపజేయునో, ఆరీతిగనే, పెద్దపెద్ద గ్రంథములను వల్లించి, దీర్ఘోపన్యాసములిచ్చుచు, కాలియందు ఒక ముల్లు గ్రుచ్చుకొన్నచో, అయ్యోయనువారలకీ వేదాంతసిద్ధి దూరము. అందు జ్ఞానయోగము మరిమరి గగనకుసుమము. వేదాంతపరిపక్వత ఈ పైగుణములుగలవారికే సిద్ధించగలదు. అట్టివారే ముక్తపురుషులు.

---

వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః,
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః.
అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్,
విముచ్య నిర్మమః శాంతో బ్రహ్మభూయాయ కల్పతే.

—భగవద్గీత 18 - 52, 53.

నిర్జనస్థానవాసియును, మితభోజియునై, త్రికరణముల నియమించి, నిత్యము ధ్యానమును యోగమును అభ్యసించుచు, ఐహికాముష్మిక విషయము లన్నిటియందున వైరాగ్యము బూని,

దేహేంద్రియములయం దాత్మబుద్ధిని, మొండిపట్టును, యోగబలగర్వమును, ప్రారబ్ధవశమున లభించు విషయములయందలి కోర్కెను, కోపమును, పరిగ్రహమును వదలి, శరీరమనినను జీవితమనినను అభిమానము లేక చిత్తోపరతిని బొందిన వ్యక్తి ఇహజీవనముననే బ్రహ్మజ్ఞానమునుబొంద సమర్థుడగును.

# శ్రీ వాసుదేవ మననము

## చతుర్థ వర్ణకము

శ్రీ మాచిరాజు శ్రీరామకృష్ణ

(గతసంచిక తరువాయి)

శిష్యుడు :—స్వామీ! సుఖస్వరూపుడైన ఆత్మకు దుఃఖమేల సంభవించుచున్నది?

గురువు :—వత్సా! ''దేహోఽహ మితి సంకల్పస్తద్దుఃఖమితి చోచ్యతే॥ (తేజో బిందు. ఉ. 5-91) దేహాత్మధీవృత్తియే దుఃఖమని చెప్పబడుచున్నది.'' ''నహవై స శరీరస్య సతః ప్రియా ప్రియయోరపహతిరస్తి। అశరీరం వా వసంతం న ప్రియా ప్రియే స్పృశతః''॥ (ఛాం. 8. 12-1) ''ఆత్మ దేహేంద్రియ మనో యుక్తుడగుచు అజ్ఞానవశమువలన శరీరేంద్రియాదులయందు ఆత్మాత్మీయత్వభ్రాంతిని బొంది యున్నంత పర్యంతము దైహికములైన సుఖములకు నాశములేదు అనగా సాంసారిక సుఖదుఃఖముల నాత్మీయములుగ ననుభవించుచుండును. స్వాత్మవిజ్ఞానమున అజ్ఞాన వినాశపూర్వకముగ లింగశరీరము భంగమై జీవన్ముక్తుండును విదేహముక్తుండునైన స్వస్వరూపనిష్ఠుని ప్రాపంచిక సుఖదుఃఖములెంతమాత్రము స్పృశింపనేరవు'' అను నిత్యాది శ్రుతులు ప్రమాణముగ ''యత్ర యత్ర శరీర పరిగ్రహస్తత్ర తత్రదుఃఖమ్॥'' ''ఎక్కడెక్కడ శరీర పరిగ్రహ ముండునో అక్కడక్కడ దుఃఖము ఉండును'' అని ప్రసిద్ధమగుటవలన, సుఖస్వరూపుడైన ఆత్మకు శరీర పరిగ్రహమువలననే దుఃఖము సంభవించుచున్నది.

శి :—స్వామీ! ఆత్మస్వరూపము సుఖము గదా! శరీరపరిగ్రహమాత్రమున అనగా ద్వైతమున్నదని తలంచినంతమాత్రమున అట్టి సుఖము ఏల తొలగిపోయి దుఃఖము వచ్చును?

గు :—వత్సా! వినుము. ''సుఖమావ్రియతే నిత్యం దుఃఖం వివ్రియతే సదా। యస్య కస్య చ ధర్మస్య గ్రహేణ భగవానసౌ॥'' (గౌ. పా. కా. 4-82) లోకమునం దెవ్వనికైనను మృషామాత్రమైన – వాస్తవముగా లేనట్టి – ద్వైతవస్తువునందు (శరీరమునందు) మిథ్యాభినివేశము కలిగినయెడల నిత్యమైన స్వాత్మసుఖము అనాయాసముగా ఆవరింపబడుచున్నది. ద్వైతమునందు సత్యత్వ భ్రాంతి ఎప్పుడు కలుగునో అప్పుడే స్వాత్మ సుఖమునకు ఆవరణము కలుగుచున్నది. ఆ సుఖావరణమునకు ప్రయత్నాంతర మనావశ్యకము. ఆత్మ అద్వితీయాఖండైకరసస్వరూపము. ఇట్టి పరమాత్మజ్ఞాన మత్యంతదుర్లభమగుటచేత దుఃఖము 'సదా వివ్రియతే' = సర్వదా ప్రకటితమగుచున్నది. ఈయాత్మ విషయ మిట్లు దుస్సాధ్యమైనదగుట

చేతనే ఉపనిషత్తులచేతను, వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థులైన ఆచార్యులచేతను బహువిధ ముల ప్రబోధింపబడుచున్నను తెలిసికొనుటకు శక్యముగాక యున్నది. కనుక మిథ్యాభినివేశము వలన స్వస్వాభావికముగానున్న సుఖమునకు ఆవరణము – ఆచ్ఛాదనము – కలుగుచున్నది. ఎప్పుడు మిథ్యాభినివేశమువలన ద్వైతము నందు సత్యత్వాభినివేశము కలుగునో అప్పుడే, "ద్వితీయాద్వై భయం భవతి॥ (బృ. ఉ. 1–4–2.) ఆత్మ (తన) కంటె భిన్నవస్తువున్న పుడు భయము కలుగుట లోకప్రసిద్ధము" అను శ్రుత్యనుసారము, దుఃఖము కలుగుట సహజము కావున లేని దుఃఖము ప్రాప్తించును.

శి :—స్వామీ! లోకములో మహారాజాదులకును శరీరపరిగ్రహముచేత దుఃఖము కలుగునా?

గు :—వత్సా! మహారాజాదులకుగూడ శరీరపరిగ్రహముచేత దుఃఖమే సంభవించును. వారికిని శత్రుపీడచేతను, రాజ్యభారముచేతను, ధన ధాన్యాది క్షయముచేతను, స్త్రీ పుత్రాది వియోగముచేతను, జరాదులచేతను, స్వమరణ భీతిచేతను దుఃఖము చూడబడుచుండుటవలన దుఃఖము తప్పక గలుగును.

శి :—స్వామీ! లోకములో గొందఱు తాము సుఖవంతులమని భావించుటలేదా?

గు :—వత్సా! లోకములో గొందఱు సుఖముగ నున్నారనెడి వ్యవహారము వృథా మోహమే (అజ్ఞానమే).

శి :—స్వామీ! మోహముచేనైనను దుఃఖమునకు సుఖత్వ వ్యవహారము ఎటుల గలుగును?

గు :—వత్సా! వినుము. తనమూపుననున్న భారముతో బహుదూరము పరుగెత్తిపోవుచుండు భారవాహకుడును, అట్లే సంతతము కూడ కృష్యాది కర్మ కరణశీలురు మున్నగు నిటువంటివారందఱును తమ తమ కార్యములు దుఃఖరూపమై యున్నను ఆయా కర్మమును, మోహముచేత సుఖముగ భావించి సంతుష్టులై గానముచేయుచు నుత్సాహవంతులై, ప్రవర్తించుచున్నారు. "అసారే ఖలుసంసారే సుఖభ్రాంతి శ్శరీరిణాం। లాలాపాన మివాంగుష్ఠే బాలానాం స్తన్య విభ్రమః॥" దుఃఖ మాత్రరూపమైన సంసారమునందు శరీరుల యొక్క సుఖభ్రాంతి, నిజాంగుష్ఠముచే లాలాపానమునందు శిశువులయొక్క స్తన్య పాన విభ్రమమువంటిదేగదా! అందువలన మోహముచేత దుఃఖమే సుఖమువలె ప్రతీతమగుచున్నదని తెలిసికొనవలయును.

శి :—స్వామీ! అట్లయిన వివేకులకుగూడ శరీరపరిగ్రహమువలన దుఃఖము సంభవించునా?

గు :—వత్సా! వివేకులకుగూడ క్షుత్పిపాసాదులచేతను, శీతోష్ణాదులచేతను, వ్యాధులచేతను, సర్ప వృశ్చిక వ్యాఘ్రాదులచేతను దుఃఖము కలుగుచునే యుండును.

శి :—స్వామీ! అట్లయిన వివేకులకును అవివేకులకును భేదమేమి?

గు :—వత్సా! వివేకులకును అవివేకులకును బాహ్యవ్యాపారముచేత భేదము లేకున్నను అంతఃకరణ వ్యాపారముచేత విశేషము గలదు. వివేకియగు మహాత్ముడు "సకలమపి దుఃఖమంతఃకరణస్యైవనాత్మనః। సచ్చిదానందస్వరూపస్యా త్మనోఽనృతజడ దుఃఖస్వరూపాంతః

కరణ ధర్మై రణుమాత్ర మపి సంబంధోనాస్తి॥ దుఃఖమంతయు నంతఃకరణ ధర్మమే కాని ఆత్మయొక్క ధర్మము కాదు. సచ్చిదానంద స్వరూపమైన ఆత్మకు అనృత జడదుఃఖస్వరూపమైన అంతఃకరణ ధర్మములతో లేశమాత్రమైనను సంబంధములేదు" అని "కామస్సంకల్పో విచికిత్సా శ్రద్ధా ఽశ్రద్ధా ధృతిరధృతిః హ్రీర్ధీర్భీరిత్యే తత్సర్వం మన ఏవ॥ (బృ. ఉ. 1-5-3.) కోరిక-సంకల్పము-సంశయము-శ్రద్ధ-అశ్రద్ధ-ధైర్యము-అధైర్యము-లజ్జ-బుద్ధి అనగా ఘటాద్యాకారవృత్తి - భయము అను నివి యన్నియు మనస్సుయొక్క వికారములే. "అసంగోహ్యయం పురుషః॥ (బృ. ఉ. 4-3-15.) నిష్కలత్వమువలన నిష్క్రియత్వముచేత కూటస్థానంగ చిద్రూపుడైన పరమాత్మకు అజ్ఞానదశయందు గాని జ్ఞానదశయందు గాని వాస్తవముగ బంధములేదు. బంధము అజ్ఞానమువలన గలిగిన అధ్యాసవలననే గలుగుచున్నది. బంధము వాస్తవమే యైనచో మోక్షములేకయే పోవలసివచ్చును. కనుక ఆదిత్యునకు అంధకారముతో సంబంధ మెన్నడును కలుగనట్లే ప్రత్యగాత్మకును అవిద్యతో గాని అవిద్యాకార్యముతోగాని సంబంధ మెంతమాత్రము నెన్నడును గలుగదు" అను నిత్యాదిశ్రుతివిచారణముచేతను; ఆత్మనిరవయవత్వమువలనను సత్యత్వమువలనను దేహేంద్రియ ధర్మ (స్వభావ) విరహితము - అను నిత్యాదియుక్తుల నిరంతరచింతనముచేతను; "రాగేచ్ఛా సుఖదుఃఖాది బుద్ధౌ సత్యాం ప్రవర్తతే। సుషుప్తౌ నాస్తి తన్నాశా త్తస్మాద్బుద్ధేస్తు నాత్మనః॥" (ఆత్మబోధ.) రాగము-ఇచ్ఛ-సుఖము-దుఃఖము మున్నగు ధర్మములన్నియు యథార్థముగ నంతఃకరణ ధర్మములే యగును కనుకనే అవియంతఃకరణము ప్రవర్తించుచుండు జాగ్రదవస్థయందును స్వప్నావస్థయందును ప్రవర్తించుచుండును. అంతఃకరణము విలీనమైయుండు సుషుప్త్యవస్థయందు అంతఃకరణముతోసహా అంతఃకరణ ధర్మములును విలీనమగుటవలన సుషుప్త్యవస్థయందు అంతఃకరణ ధర్మములు వర్తించుటలేదు. అందువలన నవి యంతఃకరణధర్మములు కాని ఆత్మ ధర్మములు కానేరవు అని సుషుప్తి తూష్ణీంభావ సమాధ్యవస్థలయందు స్వానుభవముచేతను, ఇట్లు శ్రుత్యుక్తి స్వానుభవములచేత విచారణ జేసి తెలిసికొని దుఃఖితుడు గాక సుఖియై యుండును. మఱియు "యస్తు సర్వాణి భూతాన్యాత్మన్యేవాను పశ్యతి। సర్వభూతేషు చాత్మానం తతో న విజుప్సతే॥" (ఈశా. ఉ. 6.) వివేకియగు నే మహాత్ముడు అవ్యక్తము మొదలుకొని స్థూలశరీరాంతము - స్థావరాంతమువఱకు గల చేతనాచేతనములగు సమస్తభూతములను జలమునందు తరంగములనువలె ఆత్మాభిన్నముగ ఆత్మయందే చూచునో, సమస్తభూతములయందును తరంగములయందు జలమును వలె సర్వాత్మకముగ స్వాత్మను జూచునో అనగా సర్వదా స్వాత్మనిష్ఠం బొందియుండునో అట్టి మహాత్ముడు సర్వసంసార సమూలబాధకమును స్వస్వరూప ప్రబోధకమునగు బ్రహ్మాత్మైకత్వాపరోక్షజ్ఞాన సాక్షాత్కారసిద్ధుడై అద్వితీయుడై యుండుటంజేసి దేనియందును ఘృణ కలిగియుండడు. ("జుగుప్సా కరుణే ఘృణే॥" ఘృణ యన రోతయు కరుణయు నని కోశము.) "బ్రహ్మభూత ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి। సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరాం॥" (గీ. 18-54.) శాస్త్రోక్త సాధనసంపత్తితో సమనుష్ఠిత సమాధినిష్ఠచే

రజస్తమోగుణములును ఆ గుణకార్యములైన రాగద్వేషాదులు అహంకార మమకారాద్యశేషమలములును సమూలోన్మూలితమగుటచేత ప్రసన్న = కేవల శుద్ధసత్త్వభావాపన్నమైన- సర్వత్ర బ్రహ్మమాత్రగ్రహణముచేత ప్రశాంతమైన - విపరీత ప్రత్యయ (జ్ఞాన) వినిర్ముక్తమైన, ఆత్మా = అంతఃకరణముగల పురుషుడు 'ప్రసన్నాత్మా' అనబడును. అనగా సమాధినిష్ఠచే పరిపక్వమైన స్వాత్మవిజ్ఞానముగల మహాత్ముడు కనుకనే. సర్వదృశ్యసంబంధమును పరిత్యజించి, బ్రహ్మభూతుడు=సద్ఘనము చిద్ఘనము ఆనందఘనము నగు పరబ్రహ్మమే నేను "బ్రహ్మైవాహం" అని బ్రాహ్మీభావము నధిగమించి జీవన్ముక్తుడైన బ్రహ్మవిత్తముడు దుఃఖింపడు. ఏమన దుఃఖహేతువైన అనర్థము (ప్రపంచము) ప్రజ్ఞానమందు లేకపోయినది. "ద్వితీయాద్వై భయం భవతి॥" (బృ. ఉ. 1-4-2.) అని ద్వైతమే భయహేతువనెడి విషయము శ్రుతిగోచరమగుచున్నది. మఱియు తనకు అన్యమైనదే భయకారణమును దుఃఖకారణమును అగుట గనబడుచున్నది. అందువలన తననే సర్వత్ర చిదేకరసముగను, ప్రశాంతముగను, వృద్ధిక్షయాదివర్జితముగను, ఆనందఘనముగను, అద్వితీయముగను సాక్షాత్తుగ జూచు బ్రహ్మవిదునకు అనర్థహేతువైన అన్యవస్తువు గోచరింపదు. కావున బ్రహ్మవిత్తముడు దుఃఖనిమిత్తా (కారణా) భావమువలన దుఃఖింపడని యర్థము. మఱియు "అహమేవేదం సర్వం" (బృ. ఉ.) "ఇదంతయు నేనే" యని సర్వాత్మభావాపత్తిచేతను, తనకంటె భిన్నమైన ప్రాప్తవ్య పదార్థమే లేనందువలనను, సమస్త వస్తువులు స్వాత్మత్వముచే ప్రాప్తములై యుండుటవలనను, "సోఽశ్నుతే సర్వాన్కామాన్సహ బ్రహ్మణా విపశ్చితా॥" (తై. ఉ. 2-1.) "బ్రాహ్మీభావము నొందిన తత్త్వవిదునకు సమస్త కోరికలు ప్రాప్తించిన వగుచున్నవి" అనెడి శ్రుతినిబట్టి, అవాప్త సర్వకామునకు కామనయే సంభవింపదు. అందువలననే దేనినీ కోరడు. జ్ఞాననిష్ఠా సహకారి సాధనములైన విశుద్ధబుద్ధిత్వాదులచేతను, తద్వృద్ధిత్వాదులచేతను సమ్యక్సంపన్నుడును సమదర్శనపరుడును సమ్యక్ జ్ఞానసిద్ధికొఱకు జ్ఞాననిష్ఠయందు సంతతప్రవృత్తిగలవాడును అగు బ్రహ్మవిదుడు ఆకాశాది స్థూలాంతములైన భూతములయందును భూత కార్యములగు బ్రహ్మాదిస్తంబపర్యంతములైన సమస్త శరీరములయందును 'పరాం మద్భక్తిం లభతే' = పరాం = జ్ఞాననిష్ఠాపరిపాకజన్యమై యున్నందునను, సంశయ విపర్యయాది దోషవినిర్ముక్తమగుటచేతను; అప్రతిబద్ధత్వము (ప్రతిబంధ. రాహిత్యము) వలనను, పరమార్థబోధకమగుట వలనను, ప్రకృష్టమైన, మద్భక్తిం=సర్వభూతములకు ఆత్మభూతము - నిర్విశేషము - అపరిచ్ఛిన్నము - సర్వోపాధివినిర్ముక్తము - చిదేకరసము - పరము - బ్రహ్మము నగు నా (ఆత్మ) భక్తిని ("స్వాత్మసుఖం భజతీతి భక్తిర్జ్ఞానం"= స్వానందరూపమును భజించునది-సేవించునది- పొందునది - గావున భక్తి - అనగా - స్వనిష్ఠా పరిపాకజమైన జ్ఞానము) పొందుచున్నాడు. నిత్యనిరంతర సమాధినిష్ఠచేత అంతఃకరణమునకు విశుద్ధసత్త్వభావము ఏర్పడగా సర్వత్రాత్మస్వరూపమాత్రగ్రాహకమైన అద్వితీయాఖండైకరసత్వమును బ్రహ్మవిదుడు పొందుచున్నాడని యర్థము. సమదర్శనమనగా.— "సమతా సర్వభావేషు (భూతేషు) యాసా సత్య పరాస్థితిః। తస్యామవస్థితం చిత్తం న

భూయో జన్మభాగ్భవేత్॥'' (మహో. ఉ. 6-4.) సర్వభావములయందును సకలభూతములయందును ఏ సమత్వము గలదో ఈ సమత్వము సత్యమైన పరాస్థితి. ఆ పరమపదమునందు విశ్రమించిన అంతఃకరణము మఱల సంసారమును పొందదు. ''పరమామృతనామ్నీసా సమతైవావశిష్యతే॥'' (మహో. ఉ. 4-16.) ''పరమామృత మను పేరుగల ఆ సమత్వమే, సమస్త ప్రపంచము స్వాత్మవిజ్ఞానమున బాధితమగుచుండగా స్వయమప్రతిహతముగ నిత్యమై సత్యమై అవశేషించియుండును'' అని సర్వశ్రుతిసమ్మతము. అవివేకియైన దురాత్ముడన్నో ఆత్మస్వరూపమును విచారణచేయక దేహేంద్రియాదికమునే ఆత్మగా నిశ్చయించి, అనాత్మధర్మములగు అనృతజడదుఃఖములను ఆత్మయందారోపించియు, ఆత్మధర్మములగు సచ్చిదానందములను అనాత్మయైన దేహాదికమునందారోపించియు నిట్లన్యోన్యాధ్యాసమును జేయుచు 'నేను దేవుడను' - 'నేను మనుష్యుడను' - 'నేను ఆంధ్రుడను' - 'నేను ద్రావిడుడను' - 'నేను బ్రాహ్మణుడను' - 'నేను క్షత్రియుడను' - 'నేను వైశ్యుడను' - 'నేను శూద్రుడను' - 'నేను బ్రహ్మచారిని' - 'నేను గృహస్థుడను' - 'నేను వానప్రస్థుడను' - 'నేను సన్న్యాసిని' - అని యీ ప్రకారముగ జాతివర్ణాశ్రమాద్యభిమానముతో భేదవంతుడై యుండును. ఇట్లు ఆంతరవ్యాపారముచేత వివేకి - అవివేకులకు ఉభయులకు బహుభేదము గలదు. మఱియు బాగుగ విచారణజేసి చూచినయెడల బాహ్యవ్యాపారముచేతగూడ వారికి ఉభయులకు సామ్యములేదు. అదెట్లన, వివేకియైన మహాత్ముడు ''ఆదావంతే చ యన్నాస్తి వర్తమానేఽపి తత్తథా। వితథైస్సదృశాస్సంతోఽవితథా ఇవలక్షితాః॥'' (గౌ. పా. కా. 2-6.) ఏది సృష్టికి పూర్వమునను లయానంతరమునను అస్తిత - ఉండుట - లేనిదో అది వర్తమానమునను అట్లే సత్త - ఉనికి - లేనిదే యగును. దృశ్యమంతయు వాస్తవముగ అసత్సదృశమయ్యును ఆత్మవేత్తలకంటె నన్యులైన అజ్ఞులచేత మాత్రము సత్యముగ జూడబడుచున్నది. అనగా జగత్సత్యత్వము అజ్ఞులచేతనే చూడబడును గాని ఆత్మజ్ఞులచేత గ్రహింపబడదని గ్రాహ్యము. ''ప్రపంచోయదివిద్యేత నివర్తేత న సంశయః। మాయామాత్ర మిదం ద్వైత మద్వైతం పరమార్థతః॥'' (గౌ. పా. కా. 1-17.) ప్రపంచమనునది ఒకటి యున్నప్పుడు సత్యము కావచ్చును. ఆ ప్రపంచము రజ్జువునందు సర్పమువలె కల్పితమే కావున లేదు. ఉన్నయెడల నివర్తించును. ఆ విషయమున సంశయమే లేదు. రజ్జువునందు భ్రాంతిబుద్ధిచేత గల్పితమగు సర్పము వాస్తవముగా ఉండి వివేకమువలన నశించుటలేదు. ఇంద్రజాలికునిచేత గల్పింపబడిన ఇంద్రజాల విద్యయందలి రథ గజ తురగాదులు వాస్తవముగా ఉండి నేత్రప్రతిరోధము తొలగిన పిదప నశించుటలేదు. అదేవిధముగా ఈ ప్రపంచమనునది ఇంద్రజాల విద్యయందలి రథాదికమువలెను, రజ్జువునందలి సర్పమువలెను మాయామాత్రమగు ద్వైతము. రజ్జువువలెను, ఇంద్రజాలికునివలెను అద్వైతమే పరమార్థము. కావున ప్రపంచము ఒకపర్యాయము ప్రవర్తింపనులేదు. ఒకపర్యాయము నివర్తింపనులేదు. సర్వదా అసత్యమే యని యభిప్రాయము. ''తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మ విభాగయోః। గుణా గుణేషు వర్తన్త ఇతిమత్వాన సజ్జతే॥'' (గీ. 3-28.) జ్ఞానేంద్రియములు

కర్మేంద్రియములు, బుద్ధి, మనస్సు ఇవి గుణములనబడును. వీనియందు శ్రోత్రాది జ్ఞానేంద్రియములకే సంబంధించినది శ్రవణదర్శనాది క్రియ. వాక్పాణిపాదాది కర్మేంద్రియములకే సంబంధించినది వచనాదానాదిక్రియ. బుద్ధికే సంబంధించినది అహంకరణక్రియ. మనస్సునకే సంబంధించినది సంకల్పనక్రియ. ఆత్మయొక్క క్రియ యన్ననో కూటస్థాసంగచిద్రూపమున అవస్థానమాత్రము. అనగా ఆత్మయందే క్రియయు లేదని యర్థము. "నిష్కలం నిష్క్రియం" (శ్వే. ఉ. 6-19.) అని శ్రుతి. ఇదియ గుణవిభాగమును కర్మవిభాగమును అని తెలియవలెను. ఆ గుణకర్మవిభాగములను, ఆత్మయొక్క తత్త్వము - యాథార్థ్యమును నిరర్గళముగ నెఱింగిన బ్రహ్మవిదుడు తత్త్వవిత్తనబడును. (ఇక్కడ 'తు' అను శబ్దము అజ్ఞానికంటె వీనిని వేఱుపఱచు అర్థమున వర్తించును.) సర్వకర్మముల విషయమునను గుణములైన చక్షురాదులే గుణములైన శబ్దాదులయందు ప్రవర్తించుచున్నవి. అనగా శ్రోత్రాదులు శబ్దాదులయందును వాగాదులు వచనాదులయందును ప్రవర్తించుచున్నవి. ఆ యింద్రియములు చేయు కర్మములయందు బుద్ధియే నేను కర్తనని యహంకరించుచున్నది. 'అహంతు'= నేనో వినుటలేదు. కనుటలేదు. పలుకుటలేదు. గ్రహించుటలేదు. చేయుటలేదు. కదలుటలేదు. మఱేమన కూటస్థాసంగచిదాత్మ (ప్రత్యగాత్మ) మాత్రముగ సర్వదా తూష్ణీంభావముననే ఉండువాడను అని యిట్లు నిశ్చయించి తత్త్వవిత్తు ఇంద్రియములయందుగాని వానికర్మములయందుగాని సంగము గలవాడు కాడు. అనగా తత్త్వవేత్త, అహంకారమునకాస్పదమైన యంతఃకరణము సత్త్వరజస్తమోగుణాత్మకమనియు, ఆ త్రిగుణములే మమకారాస్పదమైన జ్ఞాన - ఇచ్ఛా - క్రియారూపమగు గుణకార్యమైన కర్మమనియు, గుణములతోగాని, గుణకార్యమైన కర్మముతోగాని ఆత్మకు లేశమాత్రమైన సంబంధములేదనియు, గుణములు గుణములయందు ప్రవర్తించుచున్నవనియు రూఢిగ నెఱింగి, వానియందు "అహం-మమ = నేను, నాది" యని అభిమానమును జేయడు. వివేకియొక్కయు అవివేకియొక్కయు కర్మాచరణమునందు విశేషములేదు. కర్తృత్వాభిమత్వాదులయందుమాత్ర మత్యంత భేదము గలదు.

(సశేషము)



కారుణ్య మహత్త్వమునుగూర్చి హిందూమతమంతటి మహత్తరముగా బోధించు మతము లోకమున వేఱులేదు ; పేదల—దీనుల—కుత్తుకలపై పరమనీచముగా హిందూమతమువలె కాలిడి త్రొక్కు మతమును లోకమున వేఱులేదు. సనాతన ధర్మమునకీ దోషము నంటఁగట్టుట తగదని— పారమార్థికములనియు వ్యావహారికములనియు సర్వవిధక్రూరసిద్ధాంతములఁ గల్పించు పండితంమన్యుల, వంచకుల, దోషమిదియని—పరమేశ్వరుఁడు నాకుఁ దెలిపియున్నాడు.

—శ్రీ వివేకానందస్వామి.

# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిశరణమ్

శశినికేతనము,
పూరి,
10-7-'17.

ప్రియ దే...

నీవు 7 వ తేదీన వ్రాసిన జాబునుచూచి యెంతయో సంతసించితిని. ఎంతో చక్కని ప్రార్థనలు గావించియున్నావు. ఎంతయో మేలు. అట్లే నీ ఆవేగమును ఆయనకు విన్నవింపుము. శ్రీ భగవానుడు అంతర్యామి. ఎప్పుడు మనఃప్రాణము లైక్యమై తన్ను జేర చున్నట్లు గుర్తించునో అప్పుడే భగవానుడు నీ కోరికల నెఱవేర్చును. అందులకేమియు సందియము వలదు. మనస్సును భగవచ్చరణార్పితము గావింపుము. ఆయన తప్పక సహకరించును; ఇది నిజము. మనస్సు మలినమయినపుడే సందియము లుద్భవించును. ఎల్లప్పుడును స్వార్థపరత మనస్సున నంకురింపనీయకుము. మనస్సును భగవదున్ముఖము గావింపుము. 'నా శరీరమును సంతలో నమ్మి దుర్గానామమును గొనితెచ్చితిని' అన్న పాట జ్ఞాపకమున్నదా? ఈ భావము మనస్సున దృఢముగా నాటుకొన్నచో ఏమియు భయము కలుగదు. మెల్లమెల్లగా సమస్తమును సిద్ధించును. కమలాకాంతుని పాట : భావము :

శాంకరి చరణమున మనస్సును మగ్నము చేయుము. సమస్తకష్టములును తొలగిపోవును. సంసారము మిథ్య. వృథా ఇచ్చట తిరుగుచుంటివి. కులకుండలిని బ్రహ్మమయి దేవిని నీలో చూడుము. కమలాకాంతుని ఆజ్ఞగొని శ్యామా గుణకీర్తనము గావింపుము. ఇట్లు సులభముగా సంసారార్ణవమును దరింపుము.

సుఖనదిని దెలిసికొని మెల్ల మెల్లగా తెడ్డు వేసికొనిపొమ్ము. తొందరలేదు. దేవిని ప్రార్థించుచు పోయిన నిక కొదువయేమి? నీవు ధన్యుడవని గుర్తింపుము. ఇదికాక యితరమేదేని కావలయుననిపించినచో అదియంతయు వాసన యని గ్రహింపుము. వాసన గలిగినచో అవిశ్వాసము, సంశయము, అశాంతి మున్నగునవన్నియు కలుగును. కావున జాగ్రత. దేవీ ప్రార్థనమువినా నితరమేదియు కోరకుము. ఇక నే కోరికయైన లోన ప్రవేశించిన నెంతయో కష్టము. తల్లి నీ కంతయును క్రమక్రమముగా తెలియపఱచును. నీకు తెలిసినంతవఱకు కార్యనిర్వహణమున శక్తి నిమ్మని దేవిని ప్రార్థింపుము. మనోవాక్కు లేకీభవించిన సమస్తము చక్కబడును. భగవంతుడు మనల నుంచిన చోటనే యుండి ఆయన శరణాగతులమై పడిగాపులుగాయు శ్రద్ధ నొసగుమనియే ఆయనకు నా ప్రార్థన.

ఇట్లు,
నా ప్రియాశీర్వచనములు,
శ్రీ తురీయానంద

శ్రీహరిశరణమ్

పూరి,
శశినికేతనము,
21-7-'17.

ప్రియ దే...

నీ యుత్తరముజూచి మిక్కిలిగా సంతసించితిని. భగవానుడు నీకు సుబుద్ధి నిచ్చుచున్నాడు. నానాటికి నీ చిత్తము నిర్మలమగుచున్నది. అన్నివిషయములు నీ యుత్తరము ద్వారా ప్రకాశించుటవలన నెంతయో సంతసించుచున్నాను. ఆయన ఇంకను నీయందు తన

కృపామృతమును వర్షింపవలయునని నా ప్రార్థన.

సమస్త వాసనలను వదలిపెట్టుట సులభము కాదని యంటివి. అది నిజమే. కాని మనస్సు విచారశీలమయినచో వాసనల కంతటి శక్తి యుండదు. వశిష్ఠుడు శ్రీరామచంద్రున కిట్లు చెప్పెను : 'ఏకం వివేకం...ఆదాయవిహార న్నైవ సంకటేషు న ముహ్యతి.' అనగా, వివేక విచారస్వరూపుడయిన స్నేహితునితో విహరింపగలిగినచో ఎట్టి సంకటములయందును ముగ్ధులు గావలసిన యవసరముండదు. వివేకబుద్ధిని ఎల్లప్పుడు సుస్థిరమొనర్పగలిగినచో నిజముగా మోహము శక్తివిహీనమగును. ఇదంతయు అనిత్యమన్న భావము సదా మనస్సున నున్నచో వాసనలేమిచేయగలవు? సాధారణ వాసనలవలన భయమే లేదు. ఏ వాసన భగవానుని మఱపించునో అదియే చాల చెడ్డది. భగవానుని హృదయస్థితుని గావించుకొని సంసారమున నుండినను వాసనలు కష్టములు కలిగింపజాలవు. భగవానుని పిలిచి నీ మనోవాంఛలను విన్నవింపుము. ఆయన సమస్తమును చక్కబెట్టును.

యోగవాశిష్ఠమున త్యాగమును గూర్చిన కథ యొకటి కలదు : ఒకానొక బ్రహ్మచారి తన్నొక త్యాగిగా తలంచుచు విషయములన్నింటిని త్యజించి అతిసామాన్యమయిన బట్ట, ఆసనము, కమండలము—వీనితో కాలము గడపెడివాడు. అతనికి చైతన్యము కలిగింప దలంచి, గురువు అతనిని బిలిచి, 'నీవేమి త్యాగము చేసితివి? ఏమియు చేయలేదు' అని పలికెను. అపుడు బ్రహ్మచారి తనలో 'నాకేమియు లేదే? కట్టుబట్ట, ఆసనము, కమండలువు—ఇవిమాత్రమే యున్నవి. వీనినిగూర్చియే గురువు చెప్పుచుండెనా యని తలంచి వానిని గూడ త్యజింప నిశ్చయించెను. తనయెదుట అగ్నికుండము గావించి వాని నొక్కొక్కటిగా దానిలో వైచి కాల్చెను. పిదప త్యాగము పూర్తియైనట్లు తలచెను. అపుడు గురువు నీవేమి త్యజించితివి? వస్త్రమా? అది పడుగు పేకలతో తయారైనది. అట్లే ఆసనమును, కమండలువును వివిధవస్తువులచే నిర్మింపబడినవి. వీనిని త్యజించుటవలన నీకేమి త్యాగము కలిగినది?' అని పలికెను. అపుడు బ్రహ్మచారి మఱల ఇట్లు తలపోయజొచ్చెను. 'మరి నాకింకేమి కలదు? ఉన్నది ఈ శరీర మొకటియే. సరి, దీనినికూడ అగ్నిలో ఆహుతి నొనర్తును' అని నిశ్చయించి పెద్ద మంటను గల్పించి, తనశరీరమును అర్పింప బోయెను. ఆ సమయమున అతనిని జూచి గురువు, 'ఆగుము, నీవేమి చేయుచుంటివో ఆలోచింపుము. ఈ శరీరమున నీదేమయినను గలదా? ఇది నీ తలిదండ్రుల శుక్లశోణితములచే నుత్పన్నమై ఆహారమువలన రూపొంది, పుష్టి నందినది. అందువలన నీకు దీనితోడి సంబంధమేమి? అంతట బ్రహ్మచారికి జ్ఞానము కలిగెను. సమస్తవిషయములకును అభిమానమే కారణమని తెలిసికొనెను. ఈ అభిమానమును వదలినప్పుడే సరియైన త్యాగము లభించును. లేనిచో బాహ్యవిషయములు శరీరమునుగూడ వదలినను త్యాగము మాత్రము సమకూరదు.

అందువలన స్వీకారము, త్యాగము—ఈ రెండును భ్రాంతి (Puzzle). భగవచ్చరణారవిందములం దేకాంతభక్తి, ఆయన భక్తుల యందు ప్రీతి, ఆయన నామస్మరణాభిరుచి— ఇవియే మనము కోరవలయునవి.

ఇట్లు,
ప్రేమపూర్వకాశీర్వచనములతో,
శ్రీ తురీయానంద

# ప్రశ్నోత్తరములు

[పాఠకలోకము నానాడు తమ సందేహానివృత్తికొఱకు మాకు బంపుచున్న ఆధ్యాత్మికప్రశ్నలకీ 'ప్రశ్నోత్తరము' లను శీర్షికయందు ఉత్తరములు ప్రచురింప నుద్యమించితిమని తెలుపుటకు సంతసించుచున్నాము.—సంపాదకులు]

## సాధకుని జీవిత మెట్లుండవలెను?

ప్రపంచకములో మనము కోరు ప్రతి విషయముకూడ కృషి లేనిదే సిద్ధింపదు. కష్టపడినవారే ఫలమును అనుభవింపగలరు. మనము కోరు విషయము ఎంత విలువగలదో, దానికి తగిన క్రయమును ఇవ్వవలసినదేకదా. ఏ పని యందును నైపుణ్యతను పొందగోరినచో ప్రయాసపడవలెను. గానములోనేమి చిత్రకళలోనేమి ఎన్నాళ్లో పరిశ్రమ చేసిననోకాని ప్రజలనందరిని ఆకర్షించు శక్తిని గలిగించుకొనజాలము! ఇదేవిధముగా ఆధ్యాత్మికజీవితమునకూడ ఎంతయో పరిశ్రమ అత్యావశ్యకము. గొప్ప పారమార్థిక అనుభవములను కోరువారు తీవ్రములగు తపములను సల్పిరని, మన పురాణములలో చదివియున్నాము. శారీరిక, మానసిక శక్తులనెల్ల బాగుపరచి మంచిమార్గమునకు తీసికొని పోవుటయే సాధన. సాధారణ జీవితమునకును, దీనికినిఎంతయోతారతమ్యమున్నది.

ప్రాపంచిక విషయములు మన మనసును ఆకర్షించుటచే, వానిని లక్ష్యముగా పెట్టుకొని, మనము ప్రయత్నములు జరుపుచుందుము. మనసునకుకూడ ఇదిఆహ్లాదకరమగుటచే, మన ప్రవర్తనము సులభముగనే యుండును. కాని పారమార్థికవిషయములను ఇంద్రియసుఖబద్ధమైన మనసు కోరదు. వానిపై దానికిరుచి కలుగదు. కఠోరమైన నీతినియమములు తన స్వాధీనమును అడ్డగించినట్లు కనపడును. జన్మజన్మాంతరముల వాసనాపాశములు మనకు స్వేచ్ఛను నొసగవు. అందుచేతనే తీవ్రమైన ప్రయాస కావలసియున్నది. శారీరిక పరిశుభ్రతకంటె మనసును పరిశుద్ధముగా చేయుట అసాధ్యమైన పని. విషయసుఖమే పరమావధి యని తలచు మనసును ఈశ్వరునిపై నిలుపవలయును. అదియే తనకు శ్రేయస్సును కలిగించునని నమ్మకము దృఢము కావలయును. నైతిక సత్ప్రవర్తనము ఏర్పడనిదే, భగవంతునిపై మనస్సు నిలువదు. కావుననే శ్రీ రామకృష్ణునివంటి అవతార పురుషులెల్ల, ఎన్నియో ఆధ్యాత్మిక విషయములనుగూర్చి బోధించినప్పటికి, సదాచారము, సాంఘికజీవితముయొక్క రీతి, సాధకుని ప్రారంభచర్యలు—వీనినిగురించి పదే పదే చెప్పెడివారు. ఈ విధముగా తయారైనవారే ఈశ్వరప్రాప్తికి అర్హులయ్యెదరు. అప్పుడే భగవద్భక్తి హృదయమున అంకురించును.

సాధకునికి, మొట్టమొదట పరతత్త్వమునకును ఈ ప్రపంచకమునకును ఏదైన సంబంధము గలదా యన్న ప్రశ్న కలుగును. ఏలననిన, ఈ విషయములతో నిండిన ప్రపంచమును విడువవలసినట్లుగా సాధనమార్గము చూపుచున్నది కనుక. 'నా జీవితమును ఏ విధముగా నడిపింపవలెను, బాహ్యాచారములు, క్రియలు, సాంఘికజీవనముతో సంబంధించిన మత ఆచరణలు ఎంతవరకు సాధనకు తోడ్పడునో' యను సందేహము అతనికి కలుగును. మన మతానుసారము చేయు కర్మలన్నియు

ధాన్యమును కప్పియున్న ఊకవంటివని శ్రీరామకృష్ణులవారు చెప్పెడివారు. నిత్యకర్మానుష్ఠానములు, పండుగలు, వ్రతములు, ఉత్సవములు మొదలైనవి ఉండుటచేతనే కొన్నిసమయములలో మన మనసులో ఆధ్యాత్మిక ప్రవృత్తినికలిగించుచున్నవి. ఇట్టి ఆచరణలు ధర్మమును కాపాడును. కావున, ఇట్టి ఆచరణలను పనికిరానివని త్రోసివేయకూడదు. వానికి సాధన జీవితముతో సంబంధము లేకున్నను, అవి కొంతవరకు సహాయపడును. ఆధ్యాత్మిక జీవితము ఉన్నతి చెందినప్పుడు వాని అనుష్ఠానములు వానియంతట నవియే పడిపోవును. ఆ సమయమున కేవలము భగవద్భక్తియే మన సంతయు నిండియుండును. కావున బాహ్యాచరణములు, వ్రతములు వీనినన్నిటిని బలవంతముగా విడువగూడదు.

మన దేశములోని వర్ణాశ్రమ ధర్మములు, ఇతర దేశములలో సాంఘిక జీవన నియమములు, ప్రప్రథమమున మానవుని ఆధ్యాత్మిక జీవితమును కాపాడుటకు తోడ్పడును. చిన్న మొక్కలకు ఎట్లు కంచెల ప్రయోజనమున్నదో ఆ విధముగా మన జీవితముకూడ నిబంధనలచే మొదట పెరుగవలెను. తరువాత వాని ప్రయోజనముండదు. ఉదాహరణముగా విగ్రహారాధన యున్నది. చక్కటి విగ్రహమును ఎదురుగ అలంకరించి పెట్టుకొని, ధూప, దీపములతో ఆరాధించి భక్తిని కలిగించు పాటల పాడుచుండిన, మన ఆధ్యాత్మిక జీవితమునకు ఎంతయో దోహదము కలుగుటను కనుగొనగలము. ఆవిధముగనే, పుణ్యతీర్థములకు పోవుటయును మంచిదే. ఎందరో జనులు గుమిగూడి ఈశ్వరారాధన చేయుటను చూచిన, మనకు కూడ భగవద్భక్తి వృద్ధిచెందును.

తరువాత, తనకు ప్రియమైన ఇష్టదైవముపై మనసును నిలిపి ఏకాగ్రతను పెంచుటకు ప్రయత్నించవలెను. సాధారణముగా మంత్రదీక్ష తీసికొనుట దీనికొరకే. ఈ విషయమునుగురించి శ్రీ రామకృష్ణులవారి శిష్యులైన శ్రీ బ్రహ్మానందస్వామివారుకూడ ఈ విధముగా చెప్పియున్నారు.

"మంత్రదీక్ష – బహుముఖ్యము. మంత్ర సహాయమున మనస్సును ఇష్టదైవముపైన ఏకాగ్రము చేయవూనుట సులభతరము. మంత్రములేనిదే, మనస్సు ఒక భగవద్భావము నుండి మఱియొక భావమునకు పరుగులిడుచు, దేనియందును ఏకాగ్రము కానేరకుండును. పరిపూర్ణమైన ఏకాగ్రత పట్టువడనిదే ఆధ్యాత్మిక జీవితమున నేమియు సాధింపజాలము. కాబట్టి గురుసహాయము అత్యావశ్యకము. అచంచల విశ్వాసముతో శిష్యుడు ప్రతిదినము నియమానుసారముగా మంత్రజపముచేయుచు, మంత్రార్థమును ధ్యానించుచుండవలయును. ఈ విధముగా నాతడు చిత్తశాంతిని పొందును.

చిత్తశాంతియే తన సాధనలు సరిగా జరుగుచున్నవని తెలిసికొనుటకుతార్కాణము.జపము చేయుచుండిన జ్యోతిర్దర్శనమో లేక దేవ, దేవుల దర్శనమో కలుగవలెనని కలతనొందకూడదు. సాధకుని జీవితము అతికఠినమైనది. మెల్లగ పోవలయునే కాని, తొందరపడి, పలుకోట్ల సార్లు జపముచేసి, శీఘ్రముగా సిద్ధిపొందెదమని తలచుట వ్యర్థము. ప్రతి పనికూడ, తన సాధన జీవితమునకు ఆటంకము లేనిదిగా చూచుకొనవలయును. మనోనిర్మాల్యమును కాపాడుట అత్యావశ్యకము.. కావున ప్రతి నిమిషమున కూడ మిక్కిలి సావధానముగా నడచుకొనవలయును.

# శ్రీ అద్భుతానందస్వామి

శ్రీ దువ్వూరి రామకృష్ణారావు, బి. ఏ.

యానిశాసర్వ భూతానాం తస్యాం జాగర్తి సంయమీ।
యస్యాం జాగ్రతి భూతాని సానిశా పశ్యతే మునేః॥ భ. గీ॥.

శ్రీ అద్భుతానందస్వామియను లాటూమహారాజునుగూర్చి వివేకానందు లిట్లొక ప్రసంగమున జెప్పియుండిరి : "శ్రీ రామకృష్ణుల మహాద్భుత శక్తిని మీరు తెలిసికొనగోరుచో లాటూ చరిత్రమును దెలిసికొనుడు. అట్టి విషయము నే నెన్నడు గానలేదు. శ్రీవారి స్పర్శమాత్రమున బొత్తుగాఁ జదువుకొనక పోయినను, లాటూ మహాజ్ఞాని యగుట శ్రీ రామకృష్ణుల మహాద్భుత విచిత్ర మహిమము."

లాటూ మహారాజునకు నిరక్షరత పూర్తిగ పట్టి, చదువుట, వ్రాయుట, మాట్లాటయు గూడ బొత్తుగ దెలియదు. కాని భోజ మహారాజును జూచిన మాత్రాన కవనమబ్బు చందమున, శ్రీ శంకరాచార్యులవారి కృపా కటాక్షములచే మందబుద్ధులగు హస్తామలకలు, తోటకాచార్యులవారు ఉదితజ్ఞానులైన చందమున, శ్రీ రామకృష్ణుల సన్నిధి నా మహా విజ్ఞానము సదా పొరలి, పొరలి వచ్చు ఝరీ ప్రవాహమునొద్దనేయుండి, యద్దానియచంచల భక్తి, విశ్వాసముల గ్రోలుచుండి, తరియించిన యోగిపుంగవుడు లాటు. ఎన్ని బీరువాల యందలి పుస్తకముల జదువుటవలనగాని, యెంత తర్కమువలనగాని సాధ్యముగాని యసాధ్యవస్తువును, బరమహంసలవారి విజ్ఞాన ధారా కేంద్రమున గూర్చొని, యెరుకతో, మెలకువగ రేయింబవళులు రసాస్వాదనముజేసి, సాధింప, జ్ఞానదీప్తి లాటూలో స్వయంప్రకాశత్వము గనుటయు, వినుటయు నీనాటివరకును మనము కని, విని యెరుగనిచిత్రము.

శ్రీకృష్ణభగవానులు గీతలో చెప్పినట్లు, లాటూమహారాజాత్మనిగ్రహముతో బహిర్ముఖులకు దమస్సున, నంధకారముగను, నిద్రావస్థగను నుండు, నాత్మకుహారమును సదా యెరుకతో, మెలకువతో గుర్తించుచు, భిన్న, భిన్నస్వరూపములుగా ప్రజలఁజూచు, చరాచర ప్రపంచమునంతటి నద్వైతభావదీప్తిం గ్రహించుచు, నంతర్ముఖుడై, ప్రజలకు దాను నిద్రావస్థయం దున్నటుల గోచరించుచుండిన ప్రత్యక్షనిష్ఠుడు. ఎంతటి వేదాంతులు, విద్వాంసులు గాని లాటూ మహారాజును చేరి, వారి యమృత వాక్కును వినినంతనే ముగ్ధులై నిలిచెడివారు. లాటూమహామునిని గూర్చి తురీయానంద స్వామి యిటుల జెప్పిరి : "మాలో ననేకు లీశ్వర సాక్షాత్కారమును బొందక పూర్వము విద్యయను బురదనీటిలో దిగవలసి వచ్చినది. కాని లాటూ మహారాజు హనుమంతునివలె నద్దానిని లంఘించెను."

అద్భుతానందస్వామి పూర్వాశ్రమ నామము రక్తురాం. వీరు బీహారమునందలి

చాప్రాజిల్లాలో నొక పల్లెయందు బీద కర్షక కుటుంబమునం దుద్భవించిరి. వీరి పూర్వాశ్రమ విషయము లెవరికిని దెలియవు. ఎవరైనను వారిని బూర్వాశ్రమ వృత్తాంతమడిగినచో వారితో దీవ్రముగ నిటుల బదులు చెప్పెడివారు : "ఈశ్వరునిగూర్చిన స్మరణను విడచి, యీచిన్న విషయములతో నేల కాలహరణము చేయుదురు?" ఆ మాటతో, ఆ చూపుతో, ఆ ప్రశ్నించువ్యక్తి మిన్నకుండెడివాడు. తమ జీవితచరిత్రను వ్రాయుదునని యొకవ్యక్తి చెప్పగా, లాటూ మహారాజిటుల బదులుసెప్పిరి : "నా జీవితచరిత్రమును వ్రాసిన ప్రయోజనమేమి? నీవు వ్రాయదలచినచో, గురుదేవులనుగూర్చిగాని, స్వామీజీనిగూర్చిగాని వ్రాయుము. అది నీవు ప్రపంచకమునకు జేయు నుపకారము."

ఇటుల వినమ్రుడై, నిరాడంబరముగ నుండినను, అద్భుతానందులవారి మాటల ధోరణి యందు గ్రహింపబడిన విషయములే మనకు వీరి చారిత్రమున కాధారములైనవి. ఎల్లప్పుడు వీరి తలిదండ్రు లెంత కాయకష్టపడుచుండినను, వారిలేమి తొలగదాయె. దినము గడచుటయే కష్టముగనుండెను. పంచవర్షప్రాయుడు గాకమున్నె, యాతని తలిదండ్రు లిర్వురును దివంగతులైరి. అంత నాతడు తన బాబయ్య యండచేరెను. కాని వీరికిని రోజు గడవక, వీరుభయులు జీవయాత్రకై కలకత్తా చేరిరి. కలకత్తాలో కొన్నిదినములు కష్టపడిన పిమ్మట, శ్రీరామకృష్ణుల భక్తుడగు రామచంద్రదత్తునింట నీ రక్తురాం సేవకావృత్తి యందు బ్రవేశించెను.

ఇంతటి బాల్యప్రాయముననున్నను, రక్తురాం తనయజమానునింట నమితవిశ్వాసముతో గష్టపడి పనిసేయుచు దన యాత్మగౌరవమును గాపాడుకొనుచు సంచరించుచుండెను. ఒక పర్యాయము రక్తురాం బజారునకు వెళ్ళిన సందర్భమున, రామచంద్రదత్తు స్నేహితు లొకరా బజారు వెచ్చమునందు రక్తురాం కొంతడబ్బు వెనుక వేసికొనుచున్నాడని యనుమాన సూచకముగ మాటలాడెను. వెంటనే యా బాలుడు తీవ్రముగ, సగము వంగభాషలోను, సగము హిందూస్థానీలోను వచ్చియురాని భాషతో, "నేను నిశ్చయముగ సేవకుడనుగాని, దొంగనుగానని' తెలిసికొను" మనియె. ఈ గంభీరములగు నుద్ధృత వాక్యముల కాస్నేహితుడు నిరుత్తరుడయ్యెను. కాని యా బాలసేవకుని పలుకులకు దాళలేక, యాతడు రామచంద్రదత్తుతో ఫిర్యాదుసేయ, దత్తు రక్తురాం మాటలనే విశ్వసించెను. అప్పటికే రక్తురాం రామచంద్రునియొద్ద నంత నమ్మికగ బ్రవర్తించుచుండెను. రక్తురాం ఉన్నది యున్నటుల, మోటుదనముగ మాటలాడువాడు. వ్యక్తులనుబట్టి గౌరవించువాడు గాడాయె. అందువలన దత్తుస్నేహితులు రక్తురాం బాలుడైనను నతని జూడ భయపడుచుండెడివారు. ఇట్టి నడత లాటూమహారాజు జీవితమంతటియందును గనబడును.

రామచంద్రదత్తు భక్తుడుగాన నతనియింట భక్తియుతమగు, ధర్మచింతగల మాటలు వినబడుచుండెడివి. ఈ పిన్ననాట రక్తురాం చెవులనా మాటలు సొరగనే యవి తన మనస్సునకు వచ్చుచుండెడివి. "ఈశ్వరునియెడ మనఃపూర్వకముగ, నిష్కపటముగ నెవరుందురో, వారికి నిశ్చయముగా నాతని సాక్షాత్కారమగుననియు, నేకాంతస్థలమున కేగి యాతనికై యేడ్చుటయు, బ్రార్థించుటయు నెవ్వరుసేతురో

వారి కప్పుడీశ్వరుడు ప్రత్యక్షమగు"ననియు— నిట్టి వాక్యములు రక్తురాం చెవులబడి, యా వాక్యమాతని మనమున బాగుగహత్తుకొనెను. ఎదిగినపిమ్మట, వారీ మాటలు పలుమారు చెప్పెడివారు. ఈ మాటలవలన రక్తురాం ఎట్లు ధర్మచింతనలోనుండి, జీవించుటయో తెలిసికొని, వారి జీవితము నటుల సవరణ జేసికొనిరి. ఒక్కొకప్పుడు రక్తురాం దుప్పటి కప్పుకొని పరుండి, కండ్ల తడిపెట్టుకొని, యెడమచేతితో 'నాకండ్లను తుడుచుకొనుట నాయింటివార లనేకపర్యాయములు గనుపట్టిరి. ఆతడు తన బంధువులకొఱకో, స్నేహితుల కొఱకో విలపించుచున్నాడని, వారాతని నూరడించెడివారు. తర్వాత, తర్వాత వారలాతని ప్రవృత్తిని గ్రహింపగలిగిరి.

రామచంద్రుని యింటియొద్దనుండ, రక్తురాం శ్రీ గురుదేవులగూర్చివిని, వారిని సందర్శింప నాతురపడెను. కలకత్తాకు, దాని పరిసరములకు రక్తురాం క్రొత్త. కొంతశ్రమతో వెతకికొనుచు, వెదకికొనుచు శ్రీరామకృష్ణులుండు తావు నతడు చేరెను. శ్రీవారి దరి జేర తాను మామూలుబట్టలను ధరించి, యిటు నటు వసారాలో దిరుగు నొకవ్యక్తినిగాంచెను. తానదివరలో శ్రీ రామకృష్ణులు కాషాయాంబరధారులైన సన్న్యాసు లనుకొనెను. శ్రీవారిని జూచుచుండగనే, యా విషయమంతయును మరచి, రక్తురాం శ్రీవారి పాదములవ్రాలెను. అంత నాతని శ్రీ రామకృష్ణులు, నీ వెందుండి వచ్చుచుంటివని ప్రశ్నించిరి. రామచంద్రదత్తు నింటినుండి యని రక్తురాం చెప్పెను. శ్రీవారాతని దనగదిలోనికి దోడ్కొని వెళ్లి, ఫలహారములనిచ్చి, యనేక విషయము లాతనితో ముచ్చటించిరి. రక్తుఢాం తాను చూడవచ్చిన వ్యక్తి యాతడౌనా కాదాయన్న విషయమును మరచి, ప్రేమగను, సస్నేహము గను మాట్లాడుటలో నాతడు మహదానందమునొంది సంతృప్తుడాయెను. సాయంకాలము రక్తురాం ఆ సాధువునొద్ద సెలవుగైకొనబోవ, శ్రీ రామకృష్ణులాతని నడచి వెళ్లవలదని, యాతని గొంచెము తమ యొద్ద లేఖను పుచ్చుకొని, బండిమీదనో, పడవమీదనో పయనమైవెళ్లి, తిరిగి రమ్మనుచు, మొగమోటము పడవద్దనిరి. అంత రక్తురాం శ్రీవారి కనేక వందనముల నర్పించుచు, దన వద్దనే లేఖయున్నదని నవ్వుచు, దనజేబులను ఖల్లుఖల్లు మనిపించి, వారి సెలవుపుచ్చుకొని, తిరిగి వారిదర్శనముచేసికొందునని వెడలెను.

ఇట్లిలుసేరి, రక్తురాం రామచంద్రునితో దరచు గురుదేవుల ప్రేమనుగూర్చి చెప్పుచుండెడివారు. మరి రెండుమూడు దినములకు దిరిగి రక్తురాంపరమహంసలవారిదర్శనార్థమైవెళ్లెను. అది శ్రీరామకృష్ణుల భోజనసమయము. శ్రీ రామకృష్ణులు రక్తురాముని గుశలమడిగి, రక్తురాంకూడ భోజనమప్పటికి జేయనందున, నతని దమతో భోజనమునకు లెమ్మనిరి. తన దేశాచార ప్రకారము వంగదేశమువారి వంట నాతడు ముట్టడాయె. ఇంతలో పరమహంసదేవులొక యరటియాకును, గంగాజలమును దెప్పించిరి. ఇది గ్రహించి రక్తురాం, "తాము శ్రమపడవలదు. నేనిచ్చట భుజింపనొల్ల" ననియె. కాని శ్రీవారు, "ఇది గంగాజలముతో పచనమైన వంట. ఇంతేకాక, ఇది కాళీప్రసాదము. దీని దీసికొననేల శంకింతువ"నుచు రక్తురాముని బలవంతము చేసిరి. అంత రక్తురాం, తమ ప్రసాదమైనచో దాను పుచ్చుకొనెదననియె. అదివరలో రక్తురాం

తానన్నమాట లన్నిటినిమరచి, శ్రీ రామకృష్ణులవారి పళ్లెరమునుండి యాతనికి ప్రసాదమునియ్య, దానినాతఁడు గ్రహించెను. శ్రీ రామకృష్ణులు రక్తురామునందలి పరిశుద్ధాత్మను గ్రహించిరి. తనకు దిక్కు లేనిస్థితియందు, శ్రీ రామకృష్ణులప్రేమ రక్తురామును బాగుగ నాకర్షించెను. అంతటినుండి రక్తురాం తన యింటిపనుల నంతగ సామర్థ్యముగను, శ్రద్ధగను జేయజాలకుండెను.

ఈ యుపేక్షాభావమును రామచంద్రునింటి వారలు గ్రహించియు, రక్తురాం గుణమును బ్రధానముగ గొని మిన్నకుండిరి. ఇంతలో శ్రీ రామకృష్ణులు కమ్మరి పుష్కరమునకు వెళ్లి యెనిమిది మాసము లచటనే యుండిపోయిరి. అంత దన ప్రేమిని కానకనందున కాతని మనమున శూన్యమేర్పడినట్లుండి, దక్షిణేశ్వరమునకు వెళ్లుచు దుఃఖముగను, జింతాక్రాంతముగనుండెడివాఁడు. రక్తురామునుచూచువార లాతని కృంగిపోయినటుల దలంచుచుండిరి. లాటూ మహారాజాదినములనుగూర్చి యిటుల చెప్పుచుండెడివారు. "నేనా దినములలో నెంత బాధతో నుండెడివాడనో మీకు దెలియదు. శ్రీరామకృష్ణులగదికి వెళ్లెడివాడను. ఉద్యానవనములో దిరుగుచుండెడివాడను. ఇచ్చట, నచ్చట దచ్చాడెడి వాడను. కాని యంతయు జప్పగనుండెడిది. నా మనస్సులోని బాధను దొలగించుకొనుటకై నాలో నేనే యేడ్చెడివాడను. రామ్‌బాబు నామనస్సును గొంత గ్రహించినవాడై, నా కాతఁడు గురుదేవుల ఛాయాపటము నిచ్చెను."

(సశేషము)

# సత్యమతము

మూలము : **మహాత్మా గురు నానక్**

అనువాదకులు : **శ్రీ కేశవతీర్థస్వామి**

గీ॥ గర్వమును మొదలంటగా కాల్చివేసి; సర్వ మతముల వెలుగొందు సాధుజనుల
భక్తజనముల, ప్రేమింప వలయు నోయి; వినయహృదయము, కారుణ్యగుణమె, చూడ
సర్వ మతములలో గల సార మెల్ల.

గీ॥ సన్ననగు మంచి పట్టు వస్త్రములుగావు, కావు కాషాయవస్త్రముల్ కాదు బూది,
గంట వాయించుటలుగాని కాదు, మరియు; శంఖ మూదుటనుగాదు సత్యమతము.

గీ॥ కన శిరోముండనంబులుగాని, మరియు; ఎడతెగని ప్రార్థనలుగాని ఏకధాటి
శాస్త్రముల నప్పజెప్పెడి శక్తిగాని; జటిల తార్కిక పాండితీ శక్తిగాని
ఘన కఠోరతపస్సులు కాని, సచివ! సత్యమతముకాజాలదు సత్యమరయ :
మఱియు వ్యామోహ సంఘాత మధ్యమందు; మంచితనము, పవిత్రత, మహితరీతి
**కలుగు జీవితమే సుమా ఘనమతంబు!**

# గ్రంథ సమీక్ష

## జడభరతుడు

రచయిత : కావ్యతీర్థ శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి. డబుల్ క్రౌన్ 1/16 సైజు 56 పుటలు. వెల రూ. 0-12-0. ప్రాప్తిస్థానము : సాధన గ్రంథమండలి, తెనాలి.

ఇది సులభశైలిని రచింపబడిన చక్కని వచన గ్రంథము. భాగవతమునందలి కథయే యిందు వచనరూపమున రచింపబడినది. భక్తుల చరిత్రమును దెలియజేయు గ్రంథములలో నుత్తమోత్తమమయినది. భాగవతము. అందు భరతునిచరిత్రము ఆధ్యాత్మికపథమున ముందంజవేయదలచు సాధకులకెల్ల మార్గదర్శకము. రహూగణునకు చేసిన భరతుని యుపదేశము సాధకలోకానుసరణీయము. ఇట్టి కావ్యముల రచించి శ్రీశాస్త్రిగారు లోకోపకారము గావించుచున్నందులకు సంతసము వెలిబుచ్చుచున్నాము. ఇందలి శైలియు పాకమును పాఠశాలల జదువు విద్యార్థులకుగూడ ఆహ్లాదకరముగనున్నది. పాఠ్యగ్రంథ నిర్ణేతలు ఇట్టి గ్రంథముల విద్యార్థులచే జదివించుట యెంతయు ఆవశ్యకము.

## శ్రీ హరినామ మహిమ శతకము

రచయిత : నీలకాంతగోస్వామి. అనువాదకులు : శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రి. డబుల్ క్రౌన్ 1/16 సైజు. 32 పుటలు. వెల రు. 0-4-0. ప్రాప్తిస్థానము : సాధన గ్రంథమండలి, తెనాలి.

ఈ గ్రంథము హరినామమహిమను వెల్లడించు సంస్కృతశతకము. ఇందలి శ్లోకములు-వాని భావములు, భక్తుల హృదయముల కత్తుకొనుచుండును. ఇట్టి పవిత్రభావముతో రచింపబడిన ఈ గ్రంథమునకు తాత్పర్యమును వ్రాసి శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారు ఆంధ్రలోకమునకు మహోపకారము గావించి యున్నారు.

మచ్చునకు :

ప్రాకృతం నామమాత్రం హి,
ద్విరావృత్యా పురాతనం
శతావృత్యా, నవంభాతి
హరేర్నామైవ కేవలం.

తా. లోకమునందలి పేరులన్నియు రెండవసారి వినుటకు ఇదివఱకు విన్నవేకదా యన్న ఈసడింపు గలిగించును. ఎన్ని పర్యాయములు విన్నను నూతనమగు మహదానందమును కలుగజేయునది కేవలము శ్రీ హరినామమే.

శ్లో. తృణాదపి సునీచేన,
తరోరివ సహిష్ణునా
అమానినా సదాగేయం
హరేర్నామైవ కేవలం॥ గా౨॥

గడ్డిపోచకంటెను తాను తక్కువయను నభిప్రాయముతో వినమ్రుడై వృక్షమువలె నోర్పుగలవాడై నేనింతటివాడనను నభిమానము లేనివాడై శ్రీ హరినామమును కీర్తనము చేయవలయును.

---

## బాలాంబికా శతకము

రచయిత : బ్రహ్మశ్రీ ఈశ్వర సత్యనారాయణ శర్మ. డబుల్ క్రౌన్ 1/16 సైజు 32 పుటలు. ప్రాప్తిస్థానము : శ్రీశర్మదవైద్యశాల, శ్రీకాకుళం.

శర్మగారిదివఱకే ఆంధ్రలోకమునకు పరిచితులు. వీరి దేవీ సప్తశతి మున్నగు శ్రీవారి ఆంధ్రకృతులను మేమిదివఱకే పాఠకలోకమునకు పరిచితమొనర్చి యున్నాము. శర్మగారిది పద్యరచనమున అందెవేసినచేయి. ఏ పద్యమును జదివినను రసము చిప్పిలుచుండును. భావము, రసము, అర్థము, శబ్దముల పొందిక అన్నియును కలిసి చదువరుల నానందాబ్ధి నోలలాడించును. భక్తిరస పోషణమున శర్మగారు నిపుణులు. వీరి ఈ గ్రంథమును జదివి భక్తులు తమ భక్తిని అభివృద్ధిగావించుకొనగలరని నమ్ముచున్నాము.

మచ్చునకు :

శా. ముద్రాదర్శనశక్తిలేదు, విధితోఁ
బూజింపఁగా లేదు, నీ
చిద్రూపం బిద మిత్థమం చెఱుఁగ నా
చేఁ గా దభీష్టార్థ సం
పద్రాజి ప్రదమై, సుఖప్రదములై
భాసిల్లు నీ యంఘ్రి ని
ర్ణిద్రంబౌ ఋజుభక్తిఁ గొల్చుపనియే
నే నేర్తు బాలాంబికా!

మ. తలలన్నార్చెడి వారికిచ్చెదు మహా
ర్థంబుల్ సదాచార ని
శ్చలులం బొమ్మలమీఁది వెంద్రుకల యో
జన్నిల్పు దట్లే, యన
న్వాలెనా నీకిది పక్షపాతమని య
దంండా! కనన్ నీదు లీ
లలు చిత్రంబులటంచు నామనసు నే
లాలింతు బాలాంబికా!

## గోవింద దామోదర స్తోత్రము

రచయిత: బిల్వమంగళుడు. అనువాదకులు: బులుసు సూర్యప్రకాశశాస్త్రి. డబుల్ క్రౌన్ 1/16 సైజు. 64 పుటలు. వెల: 0-8-0. ప్రాప్తి స్థానము : సాధన గ్రంథ మండలి, తెనాలి.

ఇది బిల్వమంగళ మహాశయుడు శ్రీకృష్ణుని గూర్చి కావించిన స్తోత్రరాజము. ఈ స్తోత్ర శ్లోకములు ఎట్టి కఠినహృదయున కయినను భగవద్భక్తికి నేను నోచుకొనక పోయితినిగదా యన్న పశ్చాత్తాపమును గలిగించుచున్నవి. తేటతెనుగున వ్రాయబడిన తాత్పర్యము అక్షరాస్యులగు ఆంధ్రులకు భక్తిభిక్ష నిడగలదు. ఇట్టి గ్రంథముల ప్రచురించి ఆధ్యాత్మిక జీవనమున సాధకలోకమునకు సాయపడుచున్న యీ మండలి కార్యక్రమ మెంతయు కొనియాడదగి యున్నది.

---

## అమర గాథలు

రచయిత : ఎమ్. ఎస్. శాస్త్రి, బి.ఎస్.సి. డబుల్ క్రౌన్ 1/16 సైజు 80 పుటలు. వెల: 0-12-0. ప్రాప్తిస్థానము. జయానికేతనము, మద్రాసు 7.

ఈ 'అమరగాథలు' గ్రంథమాలయందిది మొదటి కుసుమము. దీనియందు అలెగ్జాండరు జీవితచరిత్ర సులభశైలిని బాలబాలికల కనువగురీతిని రచింపబడియున్నది. చిన్నితనమున నిట్టి కథల జదువుటవలన బాలబాలికలు తమ జీవనమున తాము నడువవలయు మార్గమును కొంతకు కొంత నిర్ణయించుకొనగలరు.

## వివేకానందుడు

రచయిత: బాలసరస్వతి ఉండేలమాల కొండారెడ్డి. డబుల్ క్రౌన్ 1/16 సైజు 112 పుటలు. వెల: రూ. 2–0–0. ప్రాప్తిస్థానము: జీవదయా పబ్లికేషన్సు. గొల్లల మామిడాడ, తూర్పుగోదావరి జిల్లా.

ఇది శ్రీ వివేకానందస్వామి జీవితచరిత్ర. పద్యకావ్యము. ఇది రెండుభాగములుగ రచింపబడినది. (రెండు భాగములును నిండేకలవు.) ఈ కావ్యము రసవంతముగ నున్నది. ఇందలి పద్యములు ముద్దులుగొలుపుచున్నవి. పాకము ద్రాక్షాపాకమనక తప్పదు.

ఉదాహరణకు:

మ. మహదైశ్వర్యవిలాసవాసగృహ సం
పత్సార్వభౌముండనై
యిహ సామ్రాజ్యకిరీటమూని భువనం
బేలం బ్రయత్నింతునా?
అహమున్ ద్రోలి, యఘంబులందుడిచి బ్ర
హ్మానంద సాకల్య సం
గ్రహణార్థంబుగఁ గావిగట్టి తలపా
గా చుట్టి యోచింతునా?

ఉ. ముద్దులరూపు బ్రహ్మమున
మున్గినచూపు గళస్వరంబులో
గద్దరి సింహగర్జనము
కాయమునన్ నునుఁ గావియంబర
మ్మద్దమునంటి చెక్కిళులు
నందముచిందు లలాటపీఠి, ఆ
నిద్దపుమోము మోహమున
నిల్పదె యెంతటి ముక్తి కన్యకన్.

## చెన్నపురి శ్రీరామకృష్ణమఠ ధార్మికవైద్యశాల

## నివేదిక

చెన్నపురి శ్రీ రామకృష్ణమఠ ధార్మిక వైద్యశాల 1952 వ సంవత్సరపు నివేదిక మా కార్యాలయమును జేరినది. మానవసేవయే మాధవసేవ యన్న దృఢనిశ్చయముతో దారిద్ర్యమున మునిగి జిక్కి నవయుచున్న సామాన్య ప్రజానీకమునకు వలయు వైద్యసహాయము ఉచితముగ చేయుచున్న ఈవైద్యశాల ఎంతయు ప్రశంసనీయము. ఈ వైద్యశాల తమ నివేదిక యందు ప్రచురించినట్లు ఈ యేడు 93 విధములగు వ్యాధులుగల 11,796 రోగులను స్వస్థపఱచుట యెంతయు ముదావహము. వీరి యీ నిష్పాక్షిక ప్రజాసేవను గుర్తించిన ప్రభుత్వము వారు ఈ వైద్యశాలకు దాతలచే నొసగబడుచున్న విరాళములలో రూ. 250 మించిన వానికి రాబడిపన్ను రద్దుచేసిరి. ఇట్లే ప్రజోపయోగమును గుర్తించిన ప్రభుత్వమువలెనే ఉదారచిత్తులగు ధనవంతులీ వైద్యశాలా నిర్వాహకులకు వివిధ విధముల సహాయము గావించి వీరి కర్తవ్యము మూలమున లోకకల్యాణమునకు కారణభూతులగుదురుగాత!

# సంఘ వార్తలు

## శ్రీరామకృష్ణ పరమహంస జీవితోపదేశములు

తెనాలియందు శ్రీ ఆలూరు సుందరరావు గారియింట జరిగిన శ్రీమద్రామాయణ కాలక్షేప సందర్భమున 26–4–53 నాటి సాయంకాలము 7 ఘంటలకు శ్రీయుతులు ఎమ్. వి. యల్. నరసింహారావుగారు శ్రీరామకృష్ణ పరమహంస జీవితోపదేశములనుగూర్చి షుమారు రెండు గంటలసేపు ఇట్లు ఉపన్యసించిరి :

అట్టి ఈ రోజులలో శ్రీ రామకృష్ణ మిషనువారు గావించుచున్న ఆధ్యాత్మిక సేవను కొనియాడి, నేడు విశ్వవ్యాప్తమై విరాజిల్లుచున్న శ్రీరామకృష్ణ సందేశమును గూర్చి వీరొసగిన యుపన్యాసము ప్రేక్షకుల ముగ్ధుల గావించినది.

నవీనయుగమునందు పారమార్థిక విషయములు మఱచి జనసామాన్యము భౌతికవిషయ నిమగ్నులై పోవుచున్నారు. హిందూదేశము ఆధ్యాత్మికమునందే ప్రభవించి, పెరిగినది. ఆ యాధ్యాత్మికతను విడనాడుటయు భారతాంబకు మనస్సును కకవికలు గావించును. ఐహికవిషయాలనెడి సున్నల (౦) ను భగవానుడను ఒకటి (1) ప్రక్కన నుంచినపుడే వానికి విలువ గలుగగలదు. అట్లుగాక తద్విపరీతముగాచేసినచో ఐహికము సున్నయే. ఇదియే హిందూమతముయొక్క ప్రత్యేకత. ధర్మమనెడి పునాదిపై దానిని పెంపొందింపజేసి అర్థకామముల బోషించి మోక్షప్రాప్తికి అనుగుణముగా జీవితసమస్యను పరిష్కరించిన యెడల ఆధ్యాత్మికత సిద్ధించగలదు. 'త్యక్తేన భుంజీథా' అను ఉపనిషద్వాక్యానుసారము త్యాగముచే భోగమును ననుభవమునకు దెచ్చుకొనవలయును. ఇదియే శ్రీరామకృష్ణుల వారియు వారి మిషినరీలయు లక్ష్యము. ఇదియే హిందూమత హృదయము.

కావుననే 'క్షుద్రం హృదయదౌర్బల్యం...' అన్నాడు భగవానుడు గీతయందు. ఈ హృదయదౌర్బల్యమును నిర్మూలింపగల శ్రీరామకృష్ణ సందేశమే నేడు అత్యంతావశ్యకము.

## శ్రీరామకృష్ణ వివేకానంద సందేశము

తే 28–4–53 దీని బెండికొండ జ్ఞానబోధానందాశ్రమములో వైశాఖ పౌర్ణమిదినమున ఆశ్రమ భక్తులు శ్రీ నీలకంఠస్వామివారి అధ్యక్షతను, కంచరాన జానకిరామయ్యగారు 1953 ఏప్రిల్ (విజయ చైత్రము) శ్రీ రామకృష్ణ ప్రభయందుగల గురుమహిమ, కర్మసిద్ధాంతము మొదలగు ప్రకటనలు చదివిరి. పిమ్మట భజనలు, శ్రీ దత్తాత్రేయ పూజలు, శ్రీరామకృష్ణ పరమహంస, వివేకానందస్వామివారి జీవితములు ఉపన్యాసముల మూలముగా అధ్యక్షులు చెప్పిన పిమ్మట సమావేశము ముగించడమయినది.

సంపతిరావు పురుషోత్తం,
కార్యదర్శి,
జ్ఞానబోధానందాశ్రమము, బెండికొండ.

# OUR ENGLISH PUBLICATIONS

## Books at Concession Rates to VEDANTA KESARI Subscribers

*(While placing order please mention your V. K. Subs. No. without fail)*

| NAMES OF BOOKS | | Original Price Rs. | As. | Concession Price Rs. | As. |
|---|---|---|---|---|---|
| Sri Ramakrishna the Great Master | (Calico) | 25 | 0 | 24 | 0 |
| ,, ,, ,, | (Morocco) | 35 | 0 | 33 | 8 |
| The Gospel of Sri Ramakrishna | (Calico) | 20 | 0 | 18 | 12 |
| ,, ,, ,, | (Morocco) | 30 | 0 | 28 | 2 |
| Sayings of Sri Ramakrishna | | 5 | 0 | 4 | 11 |
| Thus Spake Sri Ramakrishna | | 0 | 6 | 0 | 6 |
| Tales and Parables of Sri Ramakrishna | | 2 | 8 | 2 | 5 |
| Sri Ramakrishna: His Unique Message | | 2 | 0 | 1 | 14 |
| Sri Ramakrishna and His Mission | | 0 | 10 | 0 | 9 |
| The Master and the Disciple | | 2 | 0 | 1 | 14 |
| Sri Sarada Devi (Ordinary) | | 6 | 0 | 5 | 10 |
| ,, (De Luxe) | | 9 | 0 | 8 | 8 |
| Inspired Talks (Board) | | 2 | 0 | 1 | 14 |
| ,, (Calico) | | 3 | 0 | 2 | 13 |
| Hinduism | | 1 | 0 | 0 | 15 |
| Education | | 0 | 12 | 0 | 11 |
| The Eternal Companion (Ordinary) | | 2 | 4 | 2 | 2 |
| ,, ,, (Calico) | | 3 | 4 | 3 | 0 |
| Thus Spake Vivekananda | | 0 | 6 | 0 | 6 |
| For Thinkers on Education | | 3 | 0 | 2 | 12 |
| The Story of a Dedicated Life | | 3 | 0 | 2 | 12 |
| The Message of Eternal Wisdom | | 3 | 0 | 2 | 12 |
| God and Divine Incarnations | | 2 | 4 | 2 | 2 |
| The Ancient Quest | | 1 | 8 | 1 | 6 |
| Sri Krishna, The Pastoral and King-maker | | 1 | 2 | 1 | 0 |
| Isavasya Upanishad | | 0 | 12 | 0 | 11 |
| Kenopanishad | | 0 | 12 | 0 | 11 |
| Kathopanishad | | 1 | 8 | 1 | 6 |
| Prasnopanishad | | 1 | 0 | 0 | 15 |
| Mundakopanishad | | 1 | 0 | 0 | 15 |
| Mandukyopanishad | | 0 | 12 | 0 | 11 |
| Taittiriya Upanishad | | 2 | 0 | 1 | 14 |
| Svetasvatara Upanishad | | 1 | 8 | 1 | 6 |
| Brihadaranyaka Upanishad | | 7 | 8 | 7 | 0 |
| Srimad-Bhagavad-Gita | | 7 | 0 | 6 | 8 |
| Bhagavad-Gita: the Song of God | | 2 | 12 | 2 | 9 |
| Upadeshasahasri | | 3 | 8 | 3 | 4 |
| Atmabodha | | 4 | 0 | 3 | 12 |
| Yatindramatadipika | | 5 | 0 | 4 | 11 |
| Srimad Bhagavatam: the Wisdom of God | | 3 | 8 | 3 | 4 |
| Stotraratna | | 0 | 12 | 0 | 10 |
| Divine Life | | 3 | 0 | 2 | 13 |
| Universal Prayers | | 2 | 4 | 2 | 2 |
| Prince of Ayodhya (Ordinary) | | 3 | 0 | 2 | 12 |
| ,, (Calico) | | 4 | 8 | 4 | 4 |
| Vedic Religion and Philosophy (Board) | | 2 | 8 | 2 | 5 |
| ,, ,, (Calico) | | 3 | 8 | 3 | 4 |
| Narada Bhakti Sutras (Just Out) | | 3 | 0 | 2 | 13 |

**Please ask for the Detailed Catalogues of our Tamil and Telugu Books**

**SRI RAMAKRISHNA MATH,** ***Publication Department,*** **MYLAPORE, MADRAS-4**

# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

## శ్రీ రామకృష్ణ లీలామృతము

496 పుటలు దివ్యమగు ద్వితీయ ముద్రణము! రూ. 5-0-0

## బ్రహ్మానంద బోధనలు

344 పుటలు ప్రజ్వలమగు ప్రథమ ముద్రణము! రూ. 3-8-0

## శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము)

**540 పుటలు సర్వాంగ సుందరమగు చతుర్థ ముద్రణము వెల రూ. 3-4-0**

## శ్రీమద్భగవద్గీత

504 పుటలు శ్రీధరీయ టీకాసార ప్రతిపద టీకాతాత్పర్య విశేషార్థ సహితము రూ. 4-0-0

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

**432 పుటలు** పండిత పామర రంజకమైన శైలి. అందమగు 6-వ కూర్పు రూ. 3-0-0

## శ్రీ శారదాదేవి చరిత్ర

**256 పుటలు** ఇంటింటను ఉండతగిన దివ్యగ్రంథము. ముద్దులొలుకు రెండవ కూర్పు వెల రూ. 1-12-0

## శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

**186 పుటలు (ఆదర్శప్రాయుడగు గృహస్థుని జీవితము) వెల రూ. 1-4-0**

| | | | | |
|---|---|---|---|---|
| శారదా ప్రసంగములు | ... | 2 | 8 | 0 |
| ప్రబోధరత్నాకరము | ... | 2 | 4 | 0 |
| రాజయోగము | ... | 2 | 4 | 0 |
| కర్మయోగము | | 1 | 8 | 0 |
| భక్తియోగము | ... | 1 | 4 | 0 |
| వివేకానందలేఖావళి (మొదటి భాగము) | | 1 | 8 | 0 |
| వివేకానందలేఖావళి (రెండవ భాగము) | | 1 | 8 | 0 |
| అనుష్ఠాన వేదాంతము | ... | 1 | 4 | 0 |
| వివేక సూర్యోదయము | ... | 1 | 0 | 0 |
| శ్రీ పరమహంస నీతికథా రత్నములు | | 0 | 12 | 0 |
| భక్తిమార్గము | ... | 0 | 8 | 0 |
| చికాగో నగరోపన్యాసములు | ... | 0 | 8 | 0 |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| గురూపదేశములు | | | | ... | 0 | 8 | 0 |
| నా సంస్కరణ యుద్ధవిధానము | | | | ... | 0 | 6 | 0 |
| నా గురుదేవుడు | | | | ... | 0 | 6 | 0 |
| శ్రీ పరమహంస జీవిత సంగ్రహము | | | | | 0 | 4 | 0 |
| నవీన భారతదేశము | | | | ... | 0 | 4 | 0 |
| ముక్తిమార్గము | | | | ... | 0 | 3 | 0 |
| సర్వం విష్ణుమయం జగత్ (తెలుగు) | | | | | 0 | 3 | 0 |
| శ్రీ రామనామ సంకీర్తనము | | | | ... | 0 | 1 | 0 |
| యతిగీతము (పద్యకావ్యము) | | | | ... | 0 | 1 | 0 |
| నా మతము | 0 | 0 | 6 | డజను | 0 | 5 | 0 |
| సింహ గర్జన | 0 | 0 | 6 | డజను | 0 | 5 | 0 |

గిరీశచంద్ర 0 12 0

ఇవియే కాక సంస్కృత, ఆంగ్ల, ద్రావిడ, హిందీ, కన్నడ గ్రంథములును

**వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)**

అను మాస పత్రికలును మాయొద్ద దొరకును

ఇట్లు వ్రాయుడు:

మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి.

సంపాదకులు: శ్రీ ఋతజానందస్వామి
శ్రీ కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటరు ప్రెస్సు లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి,
శ్రీ శుద్ధసత్త్వానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 15-5-53.